# సరాకురాణా ద్యమాత్రత్రింవము

(సి. యఫ్. ఆండ్రూసువిరచితము)

శ్రీయుత

గోనుగుంట్ల వెంకటసుబ్రహ్మణ్యముగారి

ఆంధ్రీకరణము.

ఉపేంద్రప్రచురణాలయము

౧౭, నారాయణమొదలివీధి

మద్రాసు.

# నిరాకరణోద్యమతత్త్వము.

ప్రియమిత్త్రమా,

## క్రీస్తుసందేశము.

ప్రస్తుతము హిందూదేశమున విశేషముగ ప్రచారమునం దున్న అసహ్యాకర మగు నీయసహాయోద్యమ మనుమాట యొక్కతత్త్వమును విపులముగ వ్రాయుమని కోరితివి. నీవు బహుదూరమున నుండుటచేతను, ప్రస్తుతపరిస్థితుల బాగుగ గుర్తించియుండకపోవుటచేతను, ప్రథమమున అసహాయోద్యమమునుగురించి కఠిన మగువిమర్శనను చేయవచ్చును. నిరాకరణోద్యమ మనుమాట యసహ్యాకరముగనే యున్నది. 'నీవు మానవకోటికి సేవకుడుగను, మానవులకు సహకారిగను' యుండవలయు నను క్రీస్తుయొక్కయాజ్ఞకు వ్యతిరేకముగ నున్నట్లు తోచుచున్నది. విశ్వసాభ్రాతృత్వమును బెంపొందింపవలసిన సమయ మాసన్న మైనది. ఐరోపాసంగ్రామమువలన కలిగిన మహాసంక్షోభమునుండి విముక్తిజెందుటకై ప్రపంచము పరితపించుచున్నది. అందులకు ముఖ్యసాధనములు, మానవకోటియందు పరస్పరప్రేమయు, మానవసేవాభిలాషయు నై యున్నవి. అట్టితరి యీయసహాయోద్యమ

మేమి టని నీవు చెప్పవచ్చును. నేను రాత్రిందివములు పై వాదము ననుసరించి యసహాయోద్యమమును బాగుగ విమ ర్శించితిని. అయిన నావాదము నన్ను నిరాకరణోద్యమప్రతి కూలునిగ జేయలేదు. నాకిప్పు డసహాయోద్యమమున గట్టి నమ్మకము గలదు. మిత్రమా, నేనును నీవలె క్రైస్తవుడనే. ప్రేమయే యీప్రపంచమునంగల దుర్వ్యసనముల రూపు మాపి శాంతిని నెలకొల్పగల దని గట్టిగ నమ్ముచున్నాడను. క్రీస్తుయొక్కసందేశసారాంశము 'దేవుని ప్రేమించుము. నీవు నిన్ను ఎట్లుప్రేమించుచున్నావో, యట్లే యొరులను ప్రేమిం పుము' అను నీరెండువాక్యములందే యిమిడి యున్నది. మన మిఱువురము, 'ఒరులు నీయెడల ఎట్లు ప్రవర్తించవలయు నని కోరుచున్నావో, యట్లే, నీవును ఇతరులయెడ ప్రవర్తించుము' అను మహోన్నత మగు క్రీస్తుయొక్కసుభాషితమును గుర్తెఱింగియున్నాము.

## సహాయనిరాకరణము.

అయినను నేను అసహాయోద్యమసూత్రములను నామనః పూర్తిగ సమర్థించుచున్నాడను. సృష్ట్యనంతరముదనుకను, ప్రపంచమునకంతటికిని, క్రీస్తే నిరాకరణోద్యమమూలసూత్ర ములకు ప్రమాణ మని యాతనిజీవితచరిత్ర చెప్పుచున్నది. ఏలనన, యాతడు దుర్మార్గము నెంతమాత్రము సహింపక, ఆ

త్మను కనుగొనజాలక తనయాత్మను కోల్పోయిన మనుష్యు నకు ప్రపంచ మంతయు నాతనివశ మైనను లాభము లేదని చెప్పినవాడై, దుర్మార్గముతోడ నెంతమాత్రము సంధి కుదుర్చు కొనడాయెను. ఇదివఅ కనేకు లీయుద్యమమున పాల్గొని యున్నారు. ఈయుద్యమము హిందూదేశ వ్యక్తిస్వరూపమును కాపాడె ననియు, హైందవులజీవితములం దయ్యది నూతన సంస్కరణ మొనరించిన దనియు, యనేకులు నాతో నుచ్చ టించియున్నారు. వారు వారియొక్కసర్వస్వమును కోలుపో వలసి వచ్చుచున్నది. అందులకు ప్రతిఫలముగ వారు జీవన్ముక్తి నొందుచున్నారు. ఇంతకంటెను విశేష మయినఫలము వే ఱొకటి గలదు. హిందూదేశ మీయుద్యమమువలన తన యంతరాత్మను రక్షించుకొనినది. ప్రాక్పశ్చిమదేశములం దం తటను వ్యాపించిన, కేవలము ఆదిభౌతికమును, కృత్రిమమును, జీవచ్ఛవమును, అగు నాగరకతనుండి హిందూదేశము విముక్తి జెందినది. తన యనుంగు పుత్రుడగు మహానీయుని సందేశ మును ననుసరించి ధర్మపథమున్రదొక్కి యాత్మసంస్కారము గావించుకొను చున్నది. యుగయుగాంతరములనుండి తనదు పుత్రరత్నములు తమతమ విద్యుక్తధర్మముల నిర్వహించుచు, తమకును తమసంతతివారలకు సంపాదించినటువంటి, అతి సున్నితమును, సుందరమును, అగు తనసహజస్వభావమును పోగొట్టుకొనుచుండెను. అందులకుమాఱుగ నిప్పటిదనుక

# నిరాకరణోద్యమ తత్వము.

పాశ్చాత్య నాగరికతయొక్క బాహ్యచిహ్నముల జూచి భ్రమించి తప్పుత్రోవల బట్టుచుండెను. అయిన నేమి ప్రస్తుతము భారత దేశము తాను మాఱుమార్గములబట్టి యధోగతిపాలగుచు నాత్మహత్య గావించుకొనుచున్న దని గ్రహించుచున్నది. అన్యవిజ్ఞానపథము ననుసరించుట తనయాత్మను నాశనము నొందించుటయే యని తెలిసికొనుచున్నది. అందువలననే భారతదేశ మీనాడు అసహాయోద్యమము నవలంబించి యా పథమువీడ దృఢకంకణముదాల్చి యున్నది. 'మాధనము నొసంగుదుము, శాంతిని నెలకొల్పెదము, ఆంగ్లసామ్రాజ్యమునం దగ్రస్థానము నొసంగెదము, రక్షణము నిత్తుము, మీరన్య విజ్ఞానపథమునే యనుసరింపు' డని ఎన్ని చెప్పినను, హిందూ దేశము వాటిని తిరస్కరించునేగాని తనదుస్వధర్మమును వీడి చనదు. తనదు సహజస్వభావమును కోల్పోవ సమ్మతింపదు. ఇట్టివాక్యముల బూటకములను, వీటి యనావశ్యకతను, బాగుగ గ్రహించినది. హిందూదేశ మట్టిపునాదులపై యాంగ్ల దేశముతోడ సఖ్య మొనగూర్చుకొనజాలదు. తాను బహు కాలము సహించి యట్టిమార్గమున కొడంబడియుండె నని యాత్మగతము గ్రహించినది. భారతీయులందు ఆత్మబలమును, సంఘీభావమును, సమకూర్చి వారిని త్యాగశీలుర గావించి యాధ్యాత్మధర్మప్రవర్తనులుగ జేయుటకు వలయు ప్రబోధము చేయగల దివ్యవ్యక్తి, లోకైకపూజ్యుం డుద్భవించియున్నాడు.

కావున హిందూదేశ మికను అట్టి యధర్మమార్గమున నడచుచు బానిసత్వమునకు వెన్నుంచి సహింపజాలదు.

## సర్వస్వాతంత్ర్యము.

ఏదేశముగాని, మన యేలుబడియం దుండినటులయిన, మనకును ఆదేశస్థులకును సర్వసౌకర్యములు కలుగునట్లు పరిపాలింపగల మని మనము విఱ్ఱవీగుచున్నారము. నేను, నా దేశ సంచారములం దనేకులతోఁ కలసిమెలసి వారితోఁ ముచ్చటించియుంటిని. మనయాంగ్లేయ సంరక్షణయందున్న రాజ్యములందు నూతనముగ పాశ్చాత్యశక్తి నిర్మాణమునుపొందుచున్న ప్రజలయం దసంతృప్తి విశేషముగనున్నది. ఆంగ్లసామ్రాజ్యమునందు ప్రజలు ఆంగ్లసంరక్షణవలన ఆనందాబ్ధి నోలలాడుచున్నా రనిమాత్రము మనదేశమునం దాంగ్లేయులు నమ్మియున్నారు. అదంతయు బూటకము. బర్మా, దక్షిణాఫ్రికా, ఫీజీ, యుగండ, మున్నగు దేశములందలి యువకులతోడను నాయకులతోడను మాట్లాడియుంటిని. అందువలన ఆప్రదేశములం దసంతృప్తితప్ప వేఱొకటి లేదని దృఢముగ జెప్పగలను. ఈజిప్టు, మెసపొటేమియా, పాలస్థానము, ఐయిర్లండు, మొదలగు దేశములందు చూతమన్నను ఈయసంతృప్తిదక్క వేఱొండు కానరాదు. క్రైస్తవులమగు మన మొకచిన్న ప్రశ్న వేసికొనెదము. మనయొక్కలాభముకొఱకే యని ప్రగ

ల్పములు చెప్పబడు, ఇట్టి విదేశీయులపాలనకు మనము సమ్మ తింతుమా? ఆపరిపాలన మనల దౌర్భాగ్యస్థితికిం గొని తెచ్చు నని చెప్పుదువుగదా! అట్టితరి నీ వేల క్రీస్తుయొక్క సందేశాను సరణీయముగ హైందవులను, బర్మావారిని, ఉగండీయులను, ఈజిప్టువారలను, ఐరిషువారిని, మనలోనివారే యని ప్రేమిం పవు? మనయం దొరు లెట్లు వర్తింపవలయు నని వాంఛించు చున్నామో వారి నట్లుజూచుట మనవిద్యుక్త ధర్మముకాదా? పరరాజులపాలనకు లోబడనొల్లని మన మేల పరరాజపరిపాల నల నేలయుంచవలెను? మనము సర్వస్వాతంత్ర్యము ననుభ వింపవలయు నని కోరుచున్నప్పుడు, ఒరులు సయితమ ట్లేల సర్వస్వాతంత్ర్యస్థితి ననుభవింపవలయు నని కోరరాదు? ప్రతి వానికిని, బ్రిటిషుసామ్రాజ్యమునంగల విదేశరాజ్యములకును స్వాతంత్ర్యమునిచ్చుటకన్న వేరుమార్గము లేదని క్రైస్తవుండ నగునాకు గోచర మగుచున్నది. కావున క్రైస్తవుల మగు మనము సామ్రాజ్యమునంగల ప్రతిదేశమునకును సర్వస్వా తంత్ర్యము సిద్ధించునట్లు మనశక్తివంచనలేక కృషిచేయుట మనవిద్యుక్తధర్మమై యున్నది. ఇయ్యది క్రీస్తుయొక్క సందే శానుసరణీయముగ నున్నదిగదా?

## ప్రాక్పశ్చిమములు.

ప్రాచీప్రతీచీదేశములందు పరస్పరము సదభిప్రాయ మవ

సర మని నాకు తెలియును. మానవకోటియొక్క భావిభాగ్యోదయము అట్టి సదభిప్రాయముమీదనే యాధారపడి యున్నది. అందులకు ఒకరినొకరు గౌరవభావముననజూచుటే అవశ్యమైనటువంటి ప్రధమసోపానము. ఈసబు కధలయందు తోడేలు గొర్రెపిల్లయెడల జూపినగౌరవము కాదు—, మన మీ యిరువదవ శతాబ్దమున ననుసరింపవలసినది. ఇంతదనుక యూరపువాసులు ఆసియా, ఆఫ్రికాల, యెడల జూపుచున్న గౌరవ మట్టిదే. అయ్యది ఒక్కదినములో పోవునదికాదు. ౧౮౮౦ వ సం. కు పూర్వము ఆఫ్రికాపటము నొకదానిని జూచితిని. కొన్ని సంవత్సరములకు మఱొక పటమును జూచితిని. రెండవదానియం దేమికనుబడినది. యూరపువారు ఆఫ్రికాను ఎంతమట్టుకు, ఎవ్వరు, ఎట్లు, దోచుకొని యన్యాయముగ నాక్రమించినదియు సూచించుచునట్టుల ఆఫ్రికాదేశపట మంతయు చిన్నచిన్న భాగములుగ విభజింపబడి యుండినది. అటుపిమ్మట ఆసియాగతియు యట్లే యయినది. ఖండమంతయు చిన్నచిన్న భాగములుగ జేయబడినది. యుద్ధమునకుపూర్వము చీనా పర్షియా దేశములకు నయిత మాగతియేపట్టినది కాని యించుక తప్పిపోయినది. బెల్జియందేశ స్వాతంత్ర్యరక్షణార్థము మహాసంగ్రామమునకు బోయిన నీవు ప్రాగ్దేశముల స్వాతంత్ర్యాపహరణమును జూచుచు నూరకుండజాల వని తలచెదను. ఆదేశములను పాశ్చాత్యులుదోచుచుండ యూరకుందువా?

స్వాతంత్ర్యమునకై పోరాడుచున్న దేశములకు సియామోద మును జూపుచు చేయూత నొసంగకున్న నీమనసు తృప్తిజెం దునా? బెల్జియము దేశముయొక్క స్వాతంత్ర్యమునకై నీప్రా ణము నర్పింప సమకట్టితివిగదా! బెల్జియందేశీయుల స్వాతం త్ర్యస్థాపన, నీహృదయమును కరగించి యుత్సాహమొసంగి నట్లు, హిందూదేశము, ఈజిప్టు, కొరియా, చీనాదేశముల యొక్క స్వాతంత్ర్యసమరము నీ కావేశమును గలిగించ లేదా? స్వాతంత్ర్యరక్షణార్థమై బెల్జియమువైపు పోరాటమునలిపిన నీవు భారతదేశీయుల స్వాతంత్ర్యమునకై పోరుసలుపుట నీ ధర్మము కాదా? మీరు మేము నార్జన్యమునకు కడంగి యుద్ధ మొనరింపముగదా! రక్తప్రవాహము మాకు సమ్మ తముగాదే! ఏసుక్రీస్తు ఎట్టియుద్ధ మొనరించి తనదుప్రాణముల నర్పించెనో అట్టి బాధ, సహనములతో గూడిన యుద్ధమునే మేము కోరుచున్నాము.

## ఏసుక్రీస్తు యుద్ధము.

ఈభావము క్రైస్తవుడవగు నీహృదయమును కరగించుట లేదా? ఈసందర్భమున నేను నాకండ్లారగాంచిన యొకసమా చారమును జెప్పెదను. దక్షిణాఫ్రికాయందలి కారాగారము నుండి అష్టకష్టములం బడి, తుదకు విముక్తులయి, వెలుపలికి వచ్చుచుండిన, పంద్రెండుగురు అతికోమలు లగువనితలను

జూచియుంటిని. వారనుభవించినకష్టముల వర్ణించుటకు పదములు చాలవు. అటువంటి ఘోరనరకము ననుభవించి వచ్చుచుండియు వారెల్లరు సంపూర్ణవికాసముతోడ గూడిన వదనములను గలిగియుండిరి. వారి బాధలవిషయమయి సంతసముతోడ మాట్లాడుచుండిరి. కారాగృహాధికారుల సత్ప్రవర్తనములనే పలుమారు నొక్కిచెప్పుచు వారిని పొగడిరి. వారు ఏమియు నేరము చేయలేదు. (వారట్లుచేయువారును కారు.) వారిదేశగౌరవమును కాపాడుటకు స్వాతంత్ర్యరక్షణార్థమై కారాగృహములకుం బోయిరి. అచ్చట జరిగిన సత్యాగ్రహమను యుద్ధము రక్తప్రవాహము లేకయే జయముగాంచినది. నాజీవితకాలమున క్రీస్తుయొక్క యాస్తి యని చెప్పగలిగినది మఱొకదానిని చూచియుండలేదు. నే నావిషయము సదా స్మరించుచుందును.

అసహాయ యోగాభ్యాసనము కూడ నట్టిదియే. సత్యాగ్రహవ్రతముయొక్కసూత్రముల ననుసరించియే యీయసహాయోద్యమము అనుష్ఠింపబడుచున్నది. పేరుమాత్రము భేదించుచున్నది. దౌర్జన్యరహిత, రక్తప్రవాహాది, పశుబలముతోగాక శమదమాదిగుణములచేతను, సహనముచేతను, బాధచేతను, ఇయ్యది పాపమునుజయించి ధర్మసంస్థాపన గావించును. హిందూదేశము విదేశజుల పాలనకులోబడి బానిసత్వమున నుండుట హేయమని యీయుద్యమము చెప్పుచున్నది.

ఆంగ్లేయులకు లోబడియుంట యట్టిదే. కావున ప్రభుత్వము వారికి తోడ్పడి యాచెడుగు స్థిరముగా స్థాపితమగుటకు సహాయముజేయుట కీయుద్యమము తిరస్కరించుచున్నది.

## స్వాతంత్ర్యము — భిక్షము కాదు.

'ఆంగ్లేయులు తమపశుబలమువలన హిందూదేశమును తమ ఏలుబడియం దుంచలేదు. సాధ్యమైనంతత్వరలో హిందూదేశమునకు బ్రిటిషుసామ్రాజ్యస్థ స్వరాజ్యము నిచ్చుటకు ప్రయత్నము చేయుచున్నారము' అని మీరు చెప్పవచ్చును. అటులయిన 'బ్రిటిషుసామ్రాజ్యస్థ' యను యంశమును గురించి తరువాత ముచ్చటించెదను. 'భారతదేశమునకు మేము స్వాతంత్ర్యము నిచ్చుచున్నా' మనిగదా చెప్పుచున్నారు. స్వాతంత్ర్యము బీదవానికి బిక్షముపెట్టుటవంటిది కాదు. స్వాతంత్ర్యము, స్వతంత్రజీవనము, ఆత్మయొసంగు దివ్యతరములగు బహుమానములు. అయ్యవి యాత్మసారిశుధ్యమువల్లను, ఆత్మసమర్పణమువలనను లభింపవలసినదే కాని అన్యథా కాదు. ఇంగ్లాండుదేశము నిశ్చయముగ హిందూదేశమునకు స్వాతంత్ర్యమునొసంగ నుద్దేశించియున్నదేని, మేము దయతలచి మీ కిచ్చు స్వాతంత్ర్యమునే మీరు పొంద నర్హులని నిర్బంధించగూడదు. అయ్యది యే హిందూదేశస్వాతంత్ర్యసమరమునందే గాక, ఐర్లాండు, ఈజిప్టుదేశముల వ్యవ

హారములందు సయితమనేకచిక్కుల నిచ్చినది. మనకు ఇతరులు 'స్వాతంత్ర్యము'ను ప్రతిపాదించు సమయమునందు మనము లేనిపోని యవాంతరములకు, కట్టుదిట్టములకు, ఒప్పుకొందుమా? మనవంశస్థులగు యమెరికావారమెరికాదేశమునం దొనరించినటుల 'సర్వస్వాతంత్ర్యదేశమును స్థాపించి స్వాతంత్ర్యమును ప్రకటించియుండువారమే! అంతేకాక మనము' ఒరులు దయార్ద్రహృదయులయి వారియిష్టమున బికుగానికి బిక్షముపెట్టులాగున స్వాతంత్ర్యము నొసంగిన మన మూరకుందుమా? సంతృప్తహృదయులమై యుందుము. వర్డ్సువర్తు, మిల్టను, షేక్సుపియరు, మున్నగు మన కవిశిఖామణుల రచనలయం దేమున్నది? అమెరికావారి స్వాతంత్ర్యస్థాపన విషయమయి బర్కుమహాశయుడు చెప్పినవాక్యములను పఠింపుడు. మన యాంగ్లసారస్వతమంతయు వ్యతిరేకాభిప్రాయమునే వెలిబుచ్చుచున్నదిగదా! అట్లుండ 'ఇతరులు మనల నేవిధమున యాదరింపవలయు నని కోరుచున్నామో, మన మట్లె యొరుల నాదరింపవలయును.' అను క్రీస్తుయొక్క యాజ్ఞానుసారముగ మన మేల వర్తించగూడదు? అట్లుగాక యాంగ్లేయ రాజకీయవేత్తలు తమకు తోచినప్పుడును, వారలకు వ్యవధి చాలినప్పుడును, వారియిష్టానుసారముగను, హిందూదేశమునకు స్వరాజ్యము నిచ్చుచున్నామని పట్టుబట్టి యొసంగు స్వాతంత్ర్యము ఎన్నటికిని నిజమగు స్వాతంత్ర్యము కానేరదు.

# సంస్కరణముల బూటకము.

ప్రియమిత్రమా,

తుదకు వచ్చిన చిక్కిది. మనవారల కొక పిచ్చి యానంద మున్నది. ముప్పదిరెండుకోట్ల ప్రజలు, రాజులు, మహారాజులు, జమీందారులును గలిగి, గొప్పఖండమును బోలియున్న హిందూదేశమును, ఆంగ్లేయుల కానాచిగనెంచుకొని ప్రపంచ పరమునం దాస్థలమును ఎఱ్ఱనిరంగున దెలియబఱచి, వారి పిల్లలకు పాఠముల జెప్పునప్పుడు, 'చూడుము! ఆంగ్లేయులు ప్రాచ్యఖండములం దెంతటి శ్లాఘాపాత్ర మగు ఘనకార్య మొనరింప గలిగియున్నారో గ్రహింపుము' అని యుదాహరణముగ జూపవచ్చు నని సంతసించుచున్నారు. సాధారణముగ నాంగ్లేయుడు దయాంతఃకరణము గలవాడు. భారతదేశము వారిసామ్రాజ్యమునందే యుండి వారిహస్తగతమై యుండు వఱకు వా రెంతటి మంచి శాసనముల నయినను జేయ సమకట్టుదురు. భారతదేశమును బ్రిటిషుసామ్రాజ్యమునం దుంచుకొను యంశమును మీ రెట్లు గ్రహించుచున్నదియు విచారించిన చాల సంతాపకరముగా నున్నది. నిజ మాలోచించిన పరస్పరానురాగమున కీషణ్మాత్రమైనను సంబంధించి యుండదు. నిన్ను బానిసగ నుంచి, నికృష్టదశయం దుంచవలయు నని

సదా జపించుచుండువానితో నీవు మిత్రుడవుగ నెట్లుండగలవు? నీవు వానిని విశేషముగ స్తుతింపవచ్చును. వానియందచంచల మగుభక్తి యున్నట్లు నటింపవచ్చును. ఆతని యనుగ్రహమును సంపాదింప చాలకష్ట మొందియుండవచ్చును. కాని నీవు వాని మిత్రుడవుగనుండ సమ్మతింపవు. ఇందుపై మీ రేమి చెప్పదలంచియున్నారో నాకు తెలియును. 'ఇప్పుడు పరిస్థితులు మారినవి. కాలానుగుణముగ నూతనయుగమునం దున్నాము. ౧౯౧౯ వ సం. పు గొప్పసంస్కరణప్రణాలిక యామోదింపబడినది. విద్య, అభివృద్ధి, మున్నగుశాఖలు భారతీయుల కప్పజెప్పబడినవి. పార్లమెంటుసభయందు జరిగినచర్చలవలన వీని నంతటిని గ్రహించితిని. శిస్తులు, రక్షకత్వము, సైన్యము, మున్నగు ముఖ్యమగు కొన్ని మాత్రమే ప్రభుత్వమువారివశమం దున్నది' అని మీరు సమాధానము చెప్పవచ్చును.

## సంస్కరణములు — సార్థకనామమా?

అయ్యదియే మీసమాధాన మయినచో నయ్యది సహేతుకము కాదని చెప్పుచున్నాడను. పాశ్చాత్యదేశములందు ప్రజానుమతిని బడయక పన్నుల విధింపగూడదను ప్రభుత్వధర్మమున్నట్లు మీకు దెలియునుగదా! ఇకను ప్రాచ్యదేశములందో అట్లుగాదు. పాశ్చాత్యదేశములం దున్నధర్మములకు వ్యతి

లేకముగ ప్రాచ్యదేశములందు జరుగుచున్నవి. విద్య మున్నగు శాఖాధికారులగు హైందవమంత్రివర్గమువారేదయిన నూతనసంస్కరణ మొనరించి వేఱుమార్గముల ద్రొక్కజూచిన చాలినంత ధనము లేదు. అధికారుల హస్తగతమయియున్న శాఖలపై ప్రజల కేలాటిహక్కును లేదు. అయినను ఆశాఖలకే మొట్టమొదట విశేషధనమును ఖర్చుపెట్టుచున్నారు. సైనికశాఖకే దాదాపు సగమురాబడి ఖర్చుపెట్టబడుచున్నది. తరువాతనో సివిలు ఉద్యోగ శాఖయొక్కఖర్చు లున్నవి. ఆ శాఖయందు ఉద్యోగీయులజీతములు నానాటికి హెచ్చుగుటకవకాశ మేర్పఱుపబడియున్నది. రక్షక (పోలీసు) శాఖ చాలధనమును మ్రింగుచున్నది. ఇవన్నియు ఆదాయమునంతటిని సొంతముగ ఖర్చుబెట్టుచున్నవి. వీటికి చాలినంతధనమొసంగబడిన తరువాతనే ప్రజాయత్తశాఖలకు సొమ్ము మంజూరు చేయబడుచున్నది.

రాష్ట్రీయప్రభుత్వములందు సయితము అంతయెక్కువ మార్పు లేమియు లేవని యొక చిన్నయుదాహరణ మొసంగెదను. నే నిప్పుడే చాందపురములోని కూలీలకష్టముల జూచి వచ్చినాడను. వేనకువేలు కూలీలు తినుటకు పట్టెడన్నమయినను దొఱుకక అస్సాం తేయాకుతోటలనుండి లేచి పారి వచ్చిరి. నదియొడ్డున, రయిలుమార్గ మెచ్చట స్టీమరును కలుసుకొనుచున్నదో అచ్చట, ఎల్లరును గుమిగూడియుండిరి.

వారియందు కొందరు కలరావ్యాధికి లోనుగావలసి వచ్చినది. అంతటియాపత్తు గలుగుచుండిన సమయములందు సయితము, ప్రభుత్వమునా రొనరించినచర్య, ప్రజలయం దాశాభంగము గలిగించి వారిని కోపవంతులజేసినది. అర్ధరాత్రివేళ ఘూర్ఖా పటాలమువారిచే మూడవతరగతి ప్రయాణికులు, విశ్రాంతి బొందు స్థలములం దించుక తమతలల నెమ్మదిన నిడుకొనిన యాకూలీలను, వెళ్లగొట్టించిరి. పాపము! ఒకవైపు క్షామ బాధయు, వే ఱొకవంకను కలరావిషవ్యాధి వ్యాపకమును, పీడించుచుండిన యాయనాథు లగుకూలీలు బహిరంగముగ నుండిన యొకమైదానమునకు పాఱిపోవునంతదనుక చావ మోదబడిరి. ఇంతకు నయ్యది వర్షఋతు వగుటంజేసి వర్షము వచ్చునట్లు సూచన లుండినవి. పాపము! చేత నొకజేనడు కఱ్ఱయైనను లేకుండిన కూలీలు తుపాకిమడమలతో సైనికులచే కొట్టబడిరి. చాలమందికి బలవత్తర మగుగాయములు తగిలినవి. ఆసమూహమునందు ఆఘూర్ఖాఘాతకుల తుపాకి దెబ్బల దప్పించుకొని పాఱిపోవుటకయినను శక్తిచాలని బలహీను లగుస్త్రీ లనేకులుండిరి. ఏమియుజేయ దోపక దెబ్బల దిన్న పసిబాలు రనేకు లుండిరి. నేనాసమయమున కచ్చోటికి వచ్చియుంటంజేసి యాకూలీల దురవస్థను కన్నులార జూచితిని. నాకు పట్టరాని మనోవేదన కలిగినది. నాకోపమునకు మితిలేదు. మీరచ్చోటయుండిన మీకు నట్లే యుండియుం

నును. ఇంతటి యమానుషకృత్యమును కప్పిపెట్టి ఎప్పటియట్లే బూటకపుమాటల సమాధానముల నిచ్చిరి. అంతటితో నీ యక్రమ మణగలేదు. మాంటేగ్యు 'వంగీయప్రభుత్వము వారు విశేషమయిన దయాస్వభావమును కనుబఱచి' రని పార్లమెంటుసభయందు వాక్రుచ్చెను.

విషాదకర మగు నీవిషయ మంతటితోఁబోలేదు. ఇప్పటికి తేయాకు తోటల యజమానులీవ్యవహారమునందు చేయి జేసికొనిరి. వీరిప్రోద్బలముచే ప్రభుత్వమువా రాకూలీల కేలాటి సాహాయ్యమును చేయ దలపెట్టరైరి. వారలకు సహాయముచేసిన మఱికొందఱుకూలీలు తోటల విడచివత్తు రను భయమే వారి నట్లు చేయించినది. అంతటితో వ్యవహారము స్తంభించిపోయినది. ప్రజలయాగ్రహమునకు మేర లేదు. నన్ను మధ్యవర్తిగ పంచాయతీజెప్ప, ఆదశయందు, నాకు కబురంపిరి. నేనుకోరిన దేదియు లేదు,— బహుస్వల్ప మయినటు వంటిది. ప్రభుత్వమువారు తమయామోదమును, కరుణారసమును, వెలిబుచ్చునటుల నైదువేలరూప్యముల నిమ్మని కోరితిని. మిగత కావలసిన సొమ్మునంతటిని ప్రజలయొద్దనుండి వసూలు చేసెద ననియు చెప్పితిని. తేయాకుతోటల పెట్టుబడిదారుల యాలోచనల ననుసరించి ప్రభుత్వమువా రెంతటిసహాయము నయినను జేయరైరి. అంత నేను స్వయముగ నధికారులతోడ ముచ్చటించుటకై డార్జిలింగునకు వెళ్లితిని. ముఖ్యకార్యదర్శిని

గాని, మంత్రినిగాని, చూచుట యనవసర మని చెప్పిరి. ఇచ్చట నేను మాట్లాడినది యాంగ్లేయులగు ముగ్గురు కార్యనిర్వాహక సభ్యులతోడనే. నేను ప్రత్యక్షముగ జూచిన యాయమానుష కృత్యములవిషయమై నొక్కి చెప్పియుంటిని. చాలయుద్రేకము తోడ మాటలాడితిని. కాని వా రామంచుకొండల మధ్యను వాసముచేయుచు తమమనస్సుల సయితము మంచుగడ్డలుగ మార్చుకొనిరేమో యనునటుల, యించుకైనను ఈవిషయ మయి శ్రద్ధదీసికొనరైరి. సంస్కరణము లమలునం దున్నను నిరంకుశాధికారము మాత్ర మట్టులే యున్నది. ఎంతటికాఠిన్య ముగను, ఎంతటిజీవచ్ఛవముగను, ఎంతటిక్రూరముగను, యుండుట కవకాశముకలదో యంతటిస్థితియందే ప్రభుత్వవర్గమువా రున్నారు. వారిని మార్చుటకు వీలుపడదు.

ఆదినమే కొందరు భారతీయశాసనసభా సభ్యులను జూచితిని. ఘూర్కాలొనరించినది వారికి చాల యాగ్రహము గలిగించెను. అయిన నేమిలాభము? వారు చేయఁగలిగిన దేమిటి? శాసనసభయందేవో నాలుగుప్రశ్నలవేసి ప్రభుత్వమువారి యుత్తరముల నందికొనిరి. పిఱికితనమును సూచించు తీర్మాన మొకదానిని గావించిరి. మాంటేగ్యుగారు పార్లమెంటునందు 'వంగీయ ప్రభుత్వమువారు చాలకరుణతో ప్రవర్తించి' రని చెప్పినమాట లమోఘముగనే యుండినవే కాని ఖండింపబడలేదు.

మీ రించుక యాలోచించుకొనుడు. నడిరేయి, నిస్సహాయులై క్షుద్బాధవలన లేచి పలుగెత్తుటకయినను శక్తిలేనంతటి బలహీనులయి కృశించియుండిన వారిపై సైనికులను బోబనిచి వారిని వెడలగొట్టుట; అనాథలగు స్త్రీజనంబులను, ఏమియు నెఱుగని పసిబాలురను, తుపాకిమడమలతో గొట్టి నొప్పించుట; కలరా మహావ్యాధితోడ పీడితు లగుచుండిన వారిని తలదాచుకొనుట కయినను వీలులేనటువంటి యా పెద్ద బయలులోనికిం దఱుముట; మున్నగు విషయముల నించుక మీ మనంబులందు దలపోయుడు! ఒకపరి యా యమానుష కృత్యముల స్మరించుకొనుడు! ఆ ఘోరమును తిలకింపుడు! ఇంగ్లండునందు పశువుల నయిత మట్టుల చూడముగదా! ఒకపిల్లకు దవడపై బలవత్తర మగుదెబ్బ తగిలినది. సిపాయీల దౌర్జన్యమునకు లోనై యాబిడ తనకంటిని కోల్పోయి యుండవలసినదే కాని యించుక తప్పినది. ఆపిల్లను నేను నా కన్నులార గాంచితిని. సంగతు లిట్లున్నను వంగీయప్రభుత్వ వర్గమువారి నివేదికల ననుసరించి మాంచెస్టరు పార్లమెంటు నందు 'వంగీయప్రభుత్వమువారు విశేషమగు కరుణారసముతోడ ప్రవర్తించి' రని చెప్పెను.

## పశుబలము — జాతిద్వేషము.

నే నించుక కఠినోక్తు లాడుచున్నా నని కోపగించుకొన

కుము. బహు దూరమునుండి కానాటుప్రభువు హిందూదేశమునకు వచ్చి యమృతసరపు దురంతముల మఱచి ప్రభుత్వము వారిని మన్నించు డని హైందవులను కోరెను. లాభ మేమి? ఆతడు హిందూదేశమును వదలి యాంగ్లభూమిని చేరెనో లేదో యప్పుడే నిస్సహాయు లగుభారతీయుల నెప్పటియట్ల హింసించుటకు ప్రభుత్వమువారు మొదలిడిరి. పశుబలముచే మత్తెక్కి హైందవుల చులకనగజూడ మొదలిడిరి. ఎంతటి యమానుషకృత్యమున కయినను వెనుకాడరయిరి. ప్రజలను మరల కోపావేశుల గావించి వారిమనంబుల నొప్పించిరి. ప్రజల యభిప్రాయములు తృణీకరింపబడినవి. ఆసేతుసీతాచల పర్యంత ముండు భారతీయులు మరల ప్రభుత్వమువారి రాక్షస కృత్యములను ఖండించిరి. డార్జిలింగు కైలాసమునందు వసించుచుండిన వంగీయప్రభుత్వ మేమాత్రము ప్రజలయందు పెరిగిన యశాంతిని గుర్తెఱింగినటుల కానరాదు. ప్రజలతో నిరాకరణ మంత్రమును జపించుటకు ప్రభుత్వమువారు మొదలిడిన ట్లున్నది. 'మేము ప్రజాభిప్రాయమున కీషణ్మాత్రమేని యు లొంగము' అని ఘంటాపదముగ చాటుచున్నది. ప్రభుత్వమువారిచర్య లిట్లుండ ప్రజలు నిరాకరణము నభ్యసించిరనుటయం దేయాశ్చర్య మున్నది? 'మీరు మాతో నేకీభవించుట కేమాత్ర మొప్పుకొనరైతిరి. మా ప్రజాభిప్రాయమును మీ రించుకేనియు పాటించుటలేదు. మీరు ఎల్లప్పు

మును ప్రత్యేకత్వమునే సూపించుచున్నారు. కావున మేము మీతో సహాయనిరాకరణము నవలంబించుటకన్న వేఱుమార్గము కానరాదు. మేము మాదారిని చూచుకొనెదము. మీరు మీదారిని నడువవచ్చును. మేము మీసహాయమును గాని, మీధనమునుగాని, మీదయనుగాని, యాచించుట లేదు.' అని ప్రజలు చెప్పు వాక్యముల యర్థము మీకు గోచర మగుట లేదా! ప్రభుత్వమువారు ప్రజలతోడ్పాటు నాసింపక బహుదూరమున నుండుటచే నిరాకరణోద్యమము బయలుదేరిన దని చెప్పవచ్చును. ఇయ్యది మీ కర్థమగుట లేదా?

ఇటీవల కరాచీనుండి కొందఱుసైనికులు రైలునందు ప్రయాణము చేయుచుండ కొన్ని లోపముల వలన వారాయుష్ణమునకు తాళజాలక చనిపోయిరి. మెసపొటేమియా యక్రమముకూడ మీకు జ్ఞాపక ముండు నని తలంచెదను. ఈ రెండును ఆంగ్లేయులకు సంబంధించినది; కావున ఆంగ్లేయు లెల్లఱును పెద్దగోల చేసిరిగదా! అయ్యది ఆంగ్లేయుల విషయము గనుక శ్రద్ధవహించితిరి. ఇట్టి క్రూరకృత్యములకు ప్రతిదినమును భారతీయులు లోనుగావలసి యున్నదిగదా! ప్రభుత్వమువారు తమ కార్యముల చక్కబెట్టుకొనుచు ఎచ్చటనో పర్వతములపై నివసించుచు ప్రజాశయముల గుర్తెఱుంగక యున్నారు. అద్దాని నూతగా గొని ప్రభుత్వపు నౌకరులు తమస్వలాభమునకై యా

సించుచున్నారు. తమపంతముల నెగ్గించుకొనుచున్నారు. వీని కంతటికిని కారణము, ప్రభుత్వము, ప్రజాప్రభుత్వమును, బాధ్యతాయుతప్రభుత్వమును, కాకపోవుటయే.

సంస్కరణములను విశేషముగ కమ్మనిమాటలచేతను, పెద్ద పెద్ద విశేషణములచేతను, పొగడుచున్నారుగదా! ఇయ్యది అంతయు నీటిబుగ్గ యగుటచేతను, సంస్కరణములు హైందవుల యభివృద్ధి కొసంగబడిన వని ఢంకావాయించు టెంతయు నొక తోలుబొమ్మలయాట యనియు, హైందవులు బాగుగ గ్రహించినవా రగుటంజేసి, తుదకు మితవాదులు సయితము ఈసంస్కరణములవిషయమై విశేషముగ విసువుజెంది యున్నారు. ౧౮౫౮ వ సం. న జాతివివక్షత ఏమాత్రము పాటింపబడ దని రాణీగారు వాక్రుచ్చిన తరువాత నిప్పటికి అరువదిమూడు వత్సరములకాల మైనది. అయినను ఈనాటికిని జాతివివక్షత బహిరంగముగ చూడబడుచునే యున్నది. నామట్టుకు నేను అనేకఉదాహరణముల చెప్పగలను. ఇకను, నిశ్చయముగ దానివలన దుర్దశ ననుభవించు భారతీయులో వందల కొలది యుదాహరణముల జెప్పగలరు.

౧౯౦౮—౯ వ సం. లందు మింటో మార్లే సంస్కరణముల విషయమయి నా కించుక తెలియును. ఆనాడే హైందవులు తమ పరిపాలనయందు సంపూర్ణ మగు బాధ్యతను గలిగి

యున్నారని చెప్పబడినది. అయిన నేమిలాభము? అప్పుడే హైందవులయందశాంతి ప్రబలినది. ప్రభుత్వముయొక్క నిరంకుశాధికారము చెదరదాయె.

## బైబిలునందలి యుదాహరణములు.

-ఇప్పుడీసంస్కరణము లమలునందున్నవి. అందు బాధ్యత భాగింపబడినది. ప్రభుత్వపు, ప్రజాయత్త, యనుశాఖల క్రిందను ప్రభుత్వాధికారము భాగింపబడినది. 'అయ్యది ఎంతమాత్రము ఆచరణయందుంచుటకు పనికివచ్చుటలేదు. ఇకను వెనుకంజవేయుటకు వీలుకాదాయె. కనుక వీటితో నేడువవలసివచ్చిన' దని ప్రభుత్వాధికారి యొకడు నాతో చెప్పెను. ఇంగ్లాండునందు హిందూదేశమునందుండు ప్రజా ప్రభుత్వవిషయమయి విశేషముగ జెప్పబడుచున్నది. దాని నంతటిని మీరు నమ్ముటకు వీలులేదు. ప్రజలకేవిషయమున నిజమగుయధికారము వచ్చినదియు నాకు గోచరము కాకున్నది.

క్రీస్తుకాలములో జరిగినవిషయము ఇప్పుడు జరుగువిషయములకు సరిసమానముగ నున్నది. ఫారసీలు, సైక్రిబులు తమవిధానమును మార్చుకొనుటయందు ముందంజవేయుచున్నామని చెప్పిరేకాని, తమకు నిశ్చయముగ నెయ్యది ప్రతిబంధకముగ నుండినదో అద్దానిని వదలి, మిగిలినవిషయము

లందు బాహ్యచిహ్నముల సంస్కరించిరి. ఆసంస్కరణముల విషయమయి చెప్పరాని యతిశయోక్తు లాడెడివారు. తా మెల్లప్పుడును మంచినే కోరెడువా రనియు, గొప్పవిషయములందే మగ్నమయి యుందు వా రని చాటుటకై బహిరంగముగ మంచివిషయములందు తమసమ్మతుల దెల్పుచుండెడివారే కాని తమనిరంకుశాధికారము నించుకేనియు విడనాడరైరి. 'మీ రెన్ని చెప్పినను మీ కెంతమాత్రము అంతఃకరణశుద్ధి లే' దని క్రీస్తు వారి నాక్షేపించెను.

ప్రస్తుతము ప్రభుత్వమువారు తమకు తెలిసియు, కావలయునని, కపటనాటకవేషధారులయి యిట్లు వర్తించుచున్నా రని నేను వారిని నిందించను. స్క్రైబ్యులు, ఫారసీలు, ఆకాలపు ధర్మముల ననుసరించి సన్మార్గవర్తనులై యుండవచ్చును. అట్టులే ప్రభుత్వమువారు చాల కష్టపడి పనిచేయుచుండవచ్చును. అయిన నేమిలాభము? వారికిని, ప్రజలకును, ప్రజాశయములకును ఏలాటిసంబంధమును లేకున్నది. ప్రజలవాంఛలను వారు గ్రహించుటలేదు. మీదు హిందూదేశమునందు స్థాపింపబడిన గొప్పగొప్ప యుద్యమము లన్నింటిని అపార్థముల గావించుకొని, వానినన్నింటిని బాగుగ నర్థముచేసికొన నొల్లక, వానికి విముఖత్వము జూపుచున్నారు. నిరాకరణోద్యమ విషయమునందు నయితము ప్రభుత్వమువారు భీతచిత్తులై ప్రవర్తించుచున్నారు.

ప్రస్తుతము దేశమునందు నూతనప్రబోధము గలిగినది. భారతీయులు మేల్కాంచియున్నారు. వారియందు నూతన జీవోదయమయి యున్నది. గాంధిమహాత్ముని నాయకత్వమున మత, సాంఘిక, రాజకీయ, సమస్యల పరిష్కరించుటకు భారతీయులు దృఢసంకల్పులయి యున్నారు. ఈయుద్యమము హిందూదేశమునందంతటను వ్యాపించియున్నది. అయ్యదియే సహాయనిరాకరణ మనుపేర బరగుచున్నది. నే నీయుద్యమ మెట్లు వికసించుచున్నదో స్వయముగ జూచుచున్నాడను. నామమాత్ర మైయున్న సంస్కృతసభల నాశ్రయించుకొని నూతన ప్రబోధానుసారముగ పనిచేయింపవలె ననిన ప్రయోజన మేమియు గలుగదు. అందువలన లాభమునకన్న నష్టమే యెక్కువగ నుండును. ప్రజాశయముల ప్రతిఘటించుటకు వలనుపడదు. వారియభిమతమే చెల్లవలయును కాని, యన్యథా కానేరదు. ప్రజలు మహాసంకల్ప పరాయణులై యున్నారు. భారతదేశమునకు ముక్తినిచ్చు మహావ్యక్తి గాంధియే యని ప్రజలు దృఢముగ నమ్మియున్నారు. భారతీయుల కడగండ్లబాపి, దానిస శృంఖలముల పటాపంచలు గావించి దాసత్వవిముక్తి నీయగల మహనీయుని గాంధియందు భారతీయులు కనుచున్నారు. ప్రజాశయములకు లోంగని ప్రభుత్వమున కేలాటిసాహాయ్యమును చేయగూడ దను నిశ్చలాభిప్రాయము గలిగియున్నారు.

భారతదేశమునందు నడుపబడుచున్న అసహాయోద్యమము నిప్పుడయినను గ్రహింపలేరా? ఏదేశమునందు కాని, ప్రభుత్వమువారు ప్రజలతోడ్పాటు నాసింపక, ఎల్లప్పుడు ప్రత్యేకత్వమును చూపుచు, అతిజాగరూకతతోడ బహుదూరముగ నున్నచో, కొంతకాలమునకు ప్రజలు విసుగు జెందినవారయి ప్రభుత్వమున కేలాటిసాహాయ్యమును జేయ సమ్మతింప నిరాకరించుట సంభవింపదా? తప్పక సంభవించును. అయ్యదియే ప్రస్తుతము భారతదేశమున జరిగినది.

# ఆంగ్లేయుల హారము.

ప్రియమిత్త్రిమా,

ఆంగ్లో—సాక్సను వంశజుల మగుమనము ప్రపంచమున కంత కును రక్షకుల మని విఱ్ఱవీగుచున్నారము. దురదృష్ట వశమున మన మాదురభిప్రాయమున ప్రాకులాడుచున్నాము. హిందూ దేశమునందును మన మొనరించుచున్న తప్పిద మదియే. విదే శములవలనగాని, దేశస్థవిషయములవలనగాని, హిందూదేశ మునకు వచ్చుయాపదలనుండి రక్షించుభారము మనయం దున్న దని యభిప్రాయపడుచున్నాము. అందువలన హిందూ దేశ సమస్యలను భారతీయులు తమఇచ్ఛవచ్చినటుల పరిష్క రించు కొనుటకు మన మవకాశ మిచ్చుటలేదు. మీాదు దేశ మునం దేదయిన స్వాతంత్ర్యోద్యమము బయలువెడలిన దానిని యభివృద్ధి పొందనీయము. అట్టియుద్యమముల వలన ఆంగ్ల ప్రభుత్వముయొక్క రక్షణాధికారమునకు భంగము వాటిల్లు నని తలంచుచున్నాము. హైందవరాజ్యాంగ విషయముల నడుపు యధికారము బ్రిటిషుసామ్రాట్టుయొక్క సొత్తని మనము నమ్మియుండుటంజేసి స్వదేశోద్యమముల విజృంభణ మట్టిహక్కులకు వ్యతిరేక మని భయపడుచున్నాము.

## దుకాణదారులు.

మనము ఏలాటి ప్రతిఫలమున కేనియు ఆసింపక హిందూ దేశరక్షక భారమును వహించుట లేదని ఎల్లరు నెఱిగిన విషయమే. ఇందులకు ప్రత్యక్షముగ నేపన్నును విధింపకున్నను, ఎట్టులేని తుదకు హిందూదేశ వర్తకమువలన ఆంగ్లేయులు విశేషలాభముల బొందుచున్నారు. 'మన జాతీయపతాకము వెనువెంటనే వాణిజ్యము చనుచుండు' నని యాంగ్లేయసామెత యొకటి కలదు. ఇంగ్లాండు తనసామ్రాజ్యము పెంపుగాంచినకొలది వర్తకమును వృద్ధిచేయుచునే వచ్చుచుండినది. నెపోలియను వాక్రుచ్చిన చొప్పున మన మొక దుకాణదారుల జాతివారమే యని చెప్పవచ్చును. అయినను, ఆంగ్లో—సాక్సనులమగు మనము తప్పొనరించినటుల మనమనస్సాక్షికి గోచర మగునేని చాల కలతజెందుదుము. మన మొకనీచకార్యమును జేయునప్పు డెవరేని జూచినటులయిన సహింపజాలము. మన మట్టి కార్యములను ఎల్లప్పుడును సమర్థించుట కనేకప్రయత్నముల జేయుదుము కాని అన్నివేళల మనము ఫలప్రదులము కాజాలము.

## దైవమా, ధనపిశాచమా?

అందువలన మన వ్యవహారములందు మనము ద్వంద్వమనస్కులమయి కపటవర్తనుల మగుచున్నాము. మనము దైవ

క్రీస్తుచెప్పిన 'నీవు విషయవాంఛకు లోనై భగవంతుని కొలువజాలవు. రెంటియందును భక్తియుండుట యసంభవము' అనువాక్యముల సత్యమును మనము గ్రహింపక తప్పదు.

## ప్రభుత్వము — రక్షకత్వము.

నే నింతదనుక వ్రాసినదంతయు హిందూదేశమునకు సంపూర్ణ మగుసంబంధము గలిగియున్నది. మన దిగ్విజయములు ధర్మబద్ధము లయినవి కావని మన మనస్సాక్షియే చెప్పుచున్నది. సర్ ఫ్రాంకుబీమన్ చెప్పిన యొప్పున 'మనము హిందూదేశమును దొంగిలితిమి'. మన యంతఃకరణములందు అయ్యది సత్య మని నమ్ముచున్నాము. అందు వలననే మనము తృప్తి గల మనంబులకు మాఱుగ సదా మనదోపిడి తనమును తలంపునకు దెచ్చు మనంబులను కలిగియున్నాము. ఇయ్యది మన బ్రిటిషు పరిపాలనయం దంతటను ప్రత్యక్షముగ కానవచ్చుచున్నది. అందువలన నింగ్లాండు మొదటినుండియు తన దోపిడితనమును సమర్థించుకొనుట కనేక కుయుక్తులబన్ని 'హిందూదేశమునకు మేము తండ్రులంతటి రక్షకులము' అని చెప్పుకొనవలసి వచ్చుచున్నది. ఇంతటి సంరక్షణాధికారము ప్రపంచమునం దెచ్చోటను కానరాదు. దేశీయు లెవ్వరును యాయుధముల నంటరా దని యాయుధశాసనము నమలులో నికిం దెచ్చితిమి. అట్లొనరించుట హైందవు లాయుధముల

తోడ యాంగ్లేయుల పయింబడి చంపుదు రని భయమువలన కాదు. ఆవిషయమయి ముచ్చటించుటే మనస్సును కళవళ పెట్టుచున్నది. మనచే పుత్రవాత్సల్యమున జూడబడు హైందవులు తమలోతాము యంతఃకలహముల పెంపుజేసికొని, యొకరినొకరు చంపుదు రని జాగ్రత్తపడి యీయింగ్లాండు అట్లొనరించినదట! ప్రతిశాఖయందును యాంగ్లేయుడే ప్రథమోద్యోగిగ నుండవలయునట! ఆంగ్లేయుల సంరక్షణయందు పాలనయం దేలాటితప్పులును యుండగూడదు! ఇంతటి జాగరూకతతో ప్రభుత్వమువారు పాలించుచుండ నేలాటి కష్టములు సంప్రాప్తించినను ఆంగ్లేయ యున్నతోద్యోగియే యద్దానిని నవరించుట కర్హుడట! ఆతడే యద్దానికి పూనుకొనుట యావశ్యకమట! ఆంగ్లేయుడే ప్రతిదానియందును మార్గదర్శకుడు కావలయునట! ఆంగ్లభాషామూలకముగనే భారతీయులకు విద్య గఱుపవలె నని నిర్బంధము పాటింపబడుచున్నది. హైందవులు కేవలము మూఢు లగుటచేత తమయాశయముల గుర్తెఱుంగజాల రని ప్రతి యాంగ్లేయుడు నమ్మి తదనుకూలముగ వర్తించుచున్నాడు. బ్రిటిషు ప్రభుత్వము యొక్క మహాత్కార్యములను, గొప్పలాభమును కనుగొనజాలని తెలివిమాలిన వారివలె హైందవులు గణింపబడుచున్నారు.

ఈవిషయమునకు తగుప్రత్యుత్తరము నొసంగుటకు మీా రత్యాతురపడుదురని నమ్ముచున్నాను. 'అదంతయు సంపూర్ణముగ మారిపోయినదిగదా!' యని మీారు సమాధానము చెప్పుదురని నాకు బాగుగ తెలియును.

'నిశ్చయముగ మారినదా' చూతము!

'నిశ్చయముగ మారినదా? లేదా?' యనువిషయమే నిశ్చయముగ మనయందు పరస్పరవిభేదముల గల్పించినది. నూతనముగ నీయబడిన సంస్కరణముల వలన గలిగిన మార్పులవిషయమున నా కెట్టియభిప్రాయ మున్నదో కొన్నినిదర్శనములవలన నీకు తెలిపియుంటిని. ఇంచుక బహిరంగవిషయములందు మార్పులు గలిగినటుల కానిపించుచున్నదే కాని, నిజ మాలోచించిన అంతరంగమునం దేలాటిమార్పును కావింపబడినటుల కానరాదు. ప్రస్తుత మమలునం దున్నద్వంద్వప్రభుత్వవిధానము, రక్షక (పోలీసు) శాఖ మొదలగు శాఖలపై యధికారము హైందవుల కీయబడక పోవుటయే, హిందూదేశప్రభుత్వమువారు భారతదేశమునం దెంతటిప్రేమ కలిగి యున్నది తెలియుచున్నది. మీాదు వారియందు ఆంగ్లేయులకుం గల యనుమానమును స్ఫుటముగ కానవచ్చుచున్నది. రానురాను బ్రిటిషువారి రక్షకత్వము వృద్ధిపొందుచున్నది. అనుమానముతోడను, పరిపూర్ణ మగు సానుభూతి లేని మన

స్సుతోడను, అమలులోనికిం దేబడిన రాజ్యాంగమునందలి మార్పులవలన భారతదేశమున కేలాటిలాభమును చేకూరదు. అట్టిమార్పులవలన లాభమునకన్న నష్ట మెక్కుడుగ నుండు ననుట కేసందియమును లేదు. కావున యట్టిసంస్కరణముల ప్రసాదించుటకన్న యూరకుండుటే మేలని నమ్ముచున్నాడను. నా యీయభిప్రాయములు పొరబాటు కావచ్చును. కాని నా యనుభవము ననుసరించి చూచితినేని యీ ద్వంద్వ ప్రభుత్వ విధానము వలన భారతీయుల కేలాటిలాభము లేదని చెప్ప గలను. వారి జాతీయజీవన విలసనమునకు గాని, వారి వారి దేశీయ సమస్యలయం దిచ్ఛానువర్తనులయి తమను తాము తమ కోరికప్రకారము పాలించుకొనుటకేని, సాధ్యముకాదు. కావున ఈవిషయమునందు మాత్రము 'గ్రుడ్డికన్నుకన్న మెల్ల కన్నే శ్రేష్ఠ' మని చెప్పబడు సిద్ధాంతమునకు వ్యతిరేకముగ 'కొన్ని సంస్కరణములకన్న ఏమియు లేకుంటయే' మేలని దృఢముగ చెప్పగలను. 'కొన్ని కొన్ని సంస్కరణములు మాత్రమే ప్రసాదింపబడిన' వనిన, యాంగ్లేయు లింకను భారతీయుల నను మానతోడ జూచుచున్నా రని సువ్యక్త మగుచున్నది. అట్టి 'యనుమానముచే గూడిన' రాజనీతి, 'నమ్మకము లేనివానికి సుఖము తక్కువ' యనునట్లు, ప్రమాదకరమే యని యూహింపనగును.

# ఆంగ్లేయుల అసహయోగము.

నా యీయభిప్రాయము లెట్లు గలిగినవో వానిని నిరూపించుటకు రెండునిదర్శనముల నొసంగుచున్నాడను. హిందూదేశమునం దుండిన తీవ్రమగు నొకానొక సమస్యా పరిష్కారార్థము సమావేశ మయినసభకు నేనును వెళ్ళియుంటిని. ఆ సమస్య ఆంగ్లేయులకు విశేషముగ సంబంధించినది కాదు. ఆ సభయందు ఏకొందరో తప్ప మిగిలినవా రెల్లరును హైందవులే. అయినను లాభ మేమి? విశేషసంఖ్యాకు లగు భారతీయుల కాంగ్లేయభాష రాకుంటం జేసియు, సభాధ్యక్షుడును, సభయందుండిన యాంగ్లేయులును, సభాకార్యక్రమము నంతటిని యాంగ్లమునందే జఱుపుటం జేసియు, హైందవు లెల్లరును మూగవారివలె యూరకుండవలసి వచ్చినది. అచ్చటి చర్చనీయాంశముల, ఇతరుల కందఱికన్నను, బాగుగ గ్రహించిన హైందవు డొక డుండెను. ఆతడు చక్కనిధార గలిగిన యుపన్యాసము నాంగ్లమున నొసంగెను. ఆతని యభిప్రాయము లన్నియు జాతీయభావముల ననుసరించియే యుండినవి. ఆతడు అన్యవిజ్ఞానమునకు బానిస గాక స్వదేశభావములు గలిగియుండెను. ఆంగ్లభాషావ్యామోహము లేక స్వాభావిక మగు తనదు హైందవ నైజమునే పొందియుండెను. ఆ సంఘమునందే సంపూర్ణముగ విజాతీయులై యుండిన భారతీయు లిరువు రుండిరి. వారు సంపూర్ణముగ యాంగ్ల నైజము

గలిగినవారయి, స్వదేశ సమస్యలను స్వదేశీయులవలె యూహింపక, విదేశీయు లగుయాంగ్లేయులవలె యూహించుచుండిరి. హైందవజాతీయజీవనమును సాంతముగ మానివైచి, సంపూర్ణముగ విజాతీయు లైపోయిరి. వారు శాహ్యాస్థము జాతీయులే యైనను అంతరంగమునందు పాశ్చాత్యులే యై యుండిరి. సభయందు సమావేశమై యుండిన యధికసంఖ్యాకు లగుభారతీయులు, ఆంగ్లభాష నెఱుంగనివా రగుటం జేసి, వారచ్చోట ఎంతమాత్రము గమనింపబడరైరి. అప్పుడప్పుడు కథాచితుగ వారికి కొన్ని విషయములు మాత్రము వారి స్వభాషయందు భాషాంతరీకరింపబడి చెప్పబడినవి. అచ్చట సంపూర్ణముగ 'విజాతీయులై పాశ్చాత్యమనంబుల గలిగి యుండిన' యాహైందవులతోడ 'కలసి సహకారులుగ నుండుట' యాయాంగ్లేయుల కెంతసుకరమో గోచర మైనది. కాని వారు 'ఆంగ్లభాష నెఱింగియు, దేశీయభావములు గలిగి తమ జాతీయజీవనమును పాడుచేసికొననటువంటి హైందవులతో కలియుట' వారికి సాధ్యమయినది కాదు. తుదకు అచ్చట జరిగిన చర్చయంతయు పూర్తిగ నాంగ్లము నెఱింగిన వారి హస్తగత మాయెను. చివరకు ఆంగ్లేయులే ఆవిషయమును నిర్ధారణజేసిరి.

ఇవ్విధముగ పాశ్చాత్యసంపర్కము వలన విజాతీయులై భ్రష్టులు కానటువంటి జాతీయవాదులతోడ నాంగ్లేయులు

సహాయనిరాకరణమునకుం ’ గడంగి రని నిశ్చయముగ చెప్ప వచ్చును. వారును ఆంగ్లేయమనంబులు గలిగినవా రగు నటుల నిర్బంధింపబడుచున్నారు. మనమో, ఈపన్త్మాత్ర మే నియు హైందవులమయి, భారతీయమనంబు గలిగి ప్రవర్తించు టకు ఏనాడును ఇచ్చగింపము. ఏనాడు దేశభాషలలోనె కార్య క్రమమంతయు జరుపుట కిష్టపడుదుమో, యానాటనుండియు మనము భారతీయుల ప్రభువులవలె విఱ్ఱవీగక, మన యర్హ స్థానము నలంకరించి, వారి యతిథులవలె మెలంగవలసినదే. హిందూదేశము నాక్రమించుకొని, భారతీయుల నశింపజేయు విధ్వంసకులమై, నిరంకుశాధికారముగలవారము గాక, వారికి సాహాయ్యము జేయుచు, వారితో సమానబాధ్యతగల భారత పౌరుల మగుదుము. వారిని హింసించి, వారిపై చక్రవర్తి త్వమును చెలాయించి, వారిదేశము నాక్రమించుకొనువారము గాక భారతీయులకు సేవజేయుటకే భారతభూమికి వచ్చిన వారివలె గౌరవమగుస్థానము నధిష్ఠించి యుందుము.

ద్వంద్వప్రభుత్వనిష్ప్రయోజనము.

మఱొక నిదర్శనము నిచ్చెదను. చాందపురమునందలి కలరాప్రదేశమునందు రోగులకు తగుచికిత్స చేయుటకు నియ మింపబడిన ప్రభుత్వోద్యోగియులకును, జాతీయ స్వయంసేవ కులకును, పరస్పరము పొత్తు గుదుర్చుట దుర్ఘటమాయెను.

స్వచ్ఛంద సేవకులు సదా ప్రభుత్వోద్యోగీయులపై నేరారోప ణల గావించుచుండిరి. ప్రభుత్వోద్యోగీయులు స్వచ్ఛంద సేవ కులను ఎల్లప్పుడు నిందించుచుండిరి. ఆ యిరుకక్షులవారిని సమాధానపఱచుట సాధ్యమయినది కాదు. వారిరువురకును గల కలతలు తీవ్రములు కా మొదలిడినవి. నేను చూచినంత దనుక ప్రభుత్వోద్యోగీయులే నేరస్థులయిరి. అందఱును వారినే నిందించిరి. వారచ్చోట సేవ జేయుటకు వచ్చినటుల గానరాదు. వారచ్చో నధికారము చేయుటకే వచ్చిన ట్లుండి నది. స్వయంసేవకులు చాల తొందరపడుచుండిరి. అయ్యది వారియుద్రేకమువలన గలిగినది. అందువలన వారును నింది తులే, గాని యున్నతస్థానము నలంకరించియుండిన ఆసాం క్రైస్తవమతాచార్యుడు వారితో కలసి పనిచేయుటకు మొద లిడిన నిముసమునుండియు, తుదివఱకు, స్వచ్ఛంద సేవకు లత్యద్భుతమగు సేవజేసి సౌమ్యముగ నుండిరి.

'జంక్షైలులను' వారిప్రభువులు వారిపై యధికారమును చలాయించుచుండిరి. అందుచే వారు మహోదాతలని పే ర్కొనబడుచుండిరి. అయ్యది పొరబాటు. 'మీలోని పెద్ద వాడు మీయందరికన్న చిన్నవానివలె మెలంగుచుండవలెను. మీనాయకుడు మీయందరి సేవకునివలె ప్రవర్తింపవలెను' అను క్రైస్తవుని యమోఘవాక్యము లాసమయమునకు నాకు స్ఫురణకు వచ్చినది.

చివర కేమాయె నని మీ రడిగెద రేమొ! ప్రభుత్వో ద్యోగియులు వెళ్లినవెంటనే ఐచ్ఛికసేవకులు ఎక్కడికి వా రక్కడకే వెళ్లిపోయిరా? అట్లు ఎంతమాత్రము జరుగలేదు. ఐచ్ఛికసేవకులు అత్యద్భుతమగు సేవజేసిరి. ఇరువురకును సంఘర్షణ లేకుండుటచే స్వయంసేవకు లత్యుత్సాహముతోడ తమపనిని నెఱవేర్చుచుండిరి. చాందపురమునందు కలరా నివారణార్థము నిర్మింపబడిన శిబిరములందు జరిగినవిషయ మును గుర్తించిన హిందూదేశ మంతటను ద్వంద్వప్రభుత్వ మసంభవ మని తేటపడుచున్నది. చాందపురమునం దొక ప్రభుత్వోద్యోగియే 'ద్వంద్వప్రభుత్వము నిష్ప్రయోజన' మని యొకప్పుడు చెప్పెను.

## ఒక యుదాహరణము.

ఈజాబును ముగించుటకుపూర్వ మొకయుదాహరణము నిచ్చెదను. ఒకయువకుడు ఈత నేర్చుకొనదలచె ననుకొను ము. ఆ ప్రభుత్వోద్యోగివంటి యుపాధ్యాయుఁ డొక డాతని వా రించుచుండును. ఇట్లు కొంత కాలము గడచిన వెనుక యువకుఁడు ఈత నేర్చుకొనవలె ననుయభిలాష విశేషముగ నుండుటం జేసి కృతనిశ్చయుఁ డగును. అంత నాతఁడు ఆయుపాధ్యాయునితో 'నిరాకరణ మవలంబించి' యాతనిపట్టునుండి విడివడి నీళ్లను ప్రవేశించును. నీటిపై తేలియుండుటకై సర్వవిధముల ప్రయ త్నము చేయును. తుదకు ఈతనేర్చుకొనును.

ఇప్పటి హిందూదేశస్థితియు యాఈతనేర్చుకొనన నభిలషించు యాావనుని స్థితివలెనే యున్నది. హిందూదేశ ప్రభుత్వముతోడ సహాయము చేయుటకు నిరాకరించుట యత్యావశ్యక మగుచున్నది. ఇంగ్లాండువారమగు మనము ఆతత్వమును గ్రహింపగలుగుచున్నాము. అద్దానిని విశేషముగ హార్షించెదము. స్వాతంత్ర్యేచ్ఛ మనవారి రక్తనాళములందు మిక్కుటముగ ప్రవహించుచున్నది. అయ్యది మనరక్తములోని యొకభాగముగ నున్నది. మనము మనపిల్లలను ధైర్యముగ నుండుటకును, సాహసవంతు లగుటకును, వారి బాల్యావస్థనుండియు నేర్పుచుందుము. స్వయంసహాయముమీదనే యాధారపడి యుండుటకు ప్రోత్సహింతుము. హిందూదేశమునందో యట్లుకాదు. హిందూదేశీయులు తమపనులను చక్కబెట్టుకొనజాల రనియు, మనమే వారిపనుల జక్కపెట్టవలసిన యావశ్యకత యున్నదనియు, తలంచుచున్నాము. కావున ఒకవైపు, మనము పూర్వమునుంచి యనుభవించుచున్నామని యనుకొను రక్షకత్వమును, మఱియొకవైపు, అధికారప్రాబల్యమును మనల వేధించుచున్నది. ఈరెంటిని వీడకున్న గత్యంతరము లేదు. అందుచే ద్వంద్వప్రభుత్వవిధాన మను త్రిశంకుస్వర్గము భారతీయుల శాంతింపజేయజాలదు.

## ఆత్మసంస్కారము.

నే జెప్పదలచినది మఱొకవిషయ మున్నది. ఆవిషయ

మయి చెప్పుట యాంగ్లేయుల కయిష్టముగ నుండవచ్చును. ఏలన హిందూదేశరక్షకత్వము ధర్మబద్ధ మయినదే యని మీరు నమ్మియున్నారు. నేనానమ్మకమును వదలుడని కోరను. కొన్ని విషయములందు మాత్రమే యాంగ్లేయులపాలన ప్రశంసార్హ మగుచున్నది. అంతమాత్ర మయినను క్రమముగ రాజ్యపాలనయే యుండియుండక పోయినయెడల ౧౫౦ సంవత్సరములుగ హిందూదేశమును పాలించుచుండిన ప్రభుత్వము అంతకాలము పాలించుటకు వీలుపడెడిది కాదు.

ఇయ్యది బాగుగనేయున్నది. నే నింతకుపూర్వము చెప్పినటుల ఆంగ్లోసాక్సనులదుర్గుణ మొకటికలదు. మనము స్వార్థము నాశింపక ప్రజలక్షేమము నారసి రాజ్యపాలన మొనరించుచుందుమేని, మన మీగాంధిగారి యుద్యమమునకు మన సంపూర్ణయామోదమును జూపియుండవలసినదే. ఆంగ్లేయుల దుర్గుణములగు భౌతికచింత, ధనాభిలాష, మున్నగువానివలన వారు జాతీయోద్యమములపట్ల విముఖు లగుచున్నారు. ఆంగ్లేయులు తమయాత్మల సంపూర్ణముగ సంస్కరించుకొనిన గాని భారతోద్యమములను చక్కగ గ్రహింపజాలరు. తా మన్యాయముగ నార్జించుచున్న లాభములను వదలివేయవలెను. అప్పుడుగాని వారు నిష్కల్మషమనస్కులు గలవారు కాజాలరు. ధనపిశాచమును, భగవంతుని, సేవించుటకు ఏరికిని సాధ్యముకాదు.

# పాకటప్రజనులహింసించుట.

ప్రియమిత్రమా,

నాసంగతి మీ కిదివఱకే బాగుగ దెలియును. నేను ప్రథమమునుండియు, విద్యావిషయములను, కర్షకుల సమస్యలను అర్థముచేసికొనుచు వానియభివృద్ధికై పాటుపడుచుంటిని. నేనెప్పుడును రాజకీయములం దారితేఱిన రాజకీయవేత్తను గాను. రాజకీయములందు కొన్నివేళల సత్యమునైనవీడి సమయోచితముగ నడువవలసివచ్చును. రాజకీయములందు రాజనీతి చతురత యను మాయోపాయము లుండుటవలన నద్దానిని నేను సంశయమనంబుతోడ పరికించుచుందునే కాని యన్యథా కాదు. అట్లనుటవలన రాజకీయములు సాంతము విసర్జనీయములని నేను చెప్పను. అందును యిప్పుడు లౌకికదశ యెక్కువయై పోయినది. ఇప్పటిసభ్యత మూడువంతులు కృత్రిమమును, ఒకభాగము మాత్రము మానవస్వభావసమన్వితమై యున్నది. ప్రస్తుతము రాజకీయవేత్తలనుపేరిడికొని, బీదసాదల నన్యాయముగ నిస్సహాయులుగజేసి, తమతమ యభీష్టముల నెఱవేర్చుకొనుచుండు రాజకీయవేత్తల నే నెంత మాత్రము సహింపజాలను. ఇట్టిపరిస్థితు లున్నవి కావున మానవశ్రేయోభిలాషులగు ప్రతిమానవుడును, అటువంటి

యత్రమములు జరుగకుండ జూచుటకై ప్రయత్నింపవలసిన తరుణ మాసన్నమైనది.

## గాంధి రాజకీయవేత్తగాదు.

గాంధి సాధారణ రాజకీయవేత్తలవంటి రాజకీయవేత్త కాడు గనుకనే, యామహనీయునివలన నుద్బోధితమయిన యుద్యమమునందు పరిపూర్ణ మయినటువంటి విశ్వాసము గలదు. ఆ మహానుభావుడు బీదవారిని చదరంగమునందలి పావువలె నుపయోగింపడు. ఆవిషయ మాతనివద్ద ముచ్చటించినంతనే యాతనియాత్మ యంతయు కంపమెత్తును. అంతియకాక యాతనిదృష్టి యంతయు బీదవారియందును, అనాథలయందును మగ్నమై యుండును. ప్రజాస్వరూపము కేవలము శ్రీమన్నారాయణునియొక్క స్వరూప మగుటంజేసియు, బీదవారిని భగవంతుడు విశేషముగ ప్రేమించుటంజేసియు, ఆతడు బీదవారి శ్రేయోభివృద్ధికై మఱియెన్నిటినైన వదలిపెట్టుటకు సంసిద్ధుడు. ఏనాడు, ఆఫ్రికాయందలి జోహన్సుబర్గుపురమునందు గాంధి విశేషముగ ధనమును గడించుచు, గొప్పధనికుడై యుండియు, సర్వసంగపరిత్యాగియై, తనదు గృహమునందు బీదలనిగాని, ధనికులనిగాని, భేదభావ మెంతమాత్రము లేక, ఎల్లర కాతిథ్య మొసంగునంతటి త్యాగశీలుడై యుండ మొదలిడెనో; ఏనాడు అమ్మహనీయుడు దారిద్ర్య

మనుకన్యను చేబట్టి బీదవాడై తనదుకాలము గడుప సంసిద్ధుడాయెనో; ఆనాటినుండియు ఆతడు బీదవారిస్నేహితుడై, బీదలయందే తననివాసము నేర్పఱచుకొనెను. వారనుభవించుకష్టముల నన్నింటిని తనదుకష్టములుగ భావించి, యొక్కనిముస మేనియు వృథాబోనీయక సర్వకాలసర్వావస్థలయందును మానవసేవాపరాయణుండై యుండును. పాటకపుజనులయందు మెలగినవాడగుటంజేసియు, దారిద్ర్య మనిన నేమిటో చక్కగ నెఱింగినవాడగుటంజేసియు, బీదవారి యభివృద్ధివిషయమై యాతనికింగల యభిప్రాయము లెంతటివానినైన విస్మయము గొలుపుననుట కేసందియము లేదు. బీదలవిషయమాతడు పూర్తిగ స్వానుభవమువలన గ్రహించినవాడగుటంజేసియు, ఆతడు యితరులమెప్పుదల కాశింపకుండుటంజేసియు, ఆతనియభిప్రాయము లత్యద్భుతములుగ నుండును. ఆతనిభావము లతీతములై వెలుగొందుచుండును. ఆంగ్లమునందలి గ్రంథము లన్నింటిలోను థోరో, టాల్స్టాయి, రస్కిను, ఎడ్వర్డు కార్పెంటరు మున్నగువారికృతు లాతని నాకర్షించినవి. ఆతని కుత్తేజముగలిగించినవాని నన్నింటిలోను క్రీస్తుయొక్క 'మౌంటు' పైనుండి యొసంగబడిన యుపదేశమాతనికి విశేషముగ నచ్చినది. ఆ యుపదేశసారాంశ మాతనికి సదా ప్రమాణముగ నుండెననుటయం దేయతిశయోక్తియు లేదు. ప్రాచ్యదేశ మతసిద్ధాంతములకును, ఉపనిష

త్తుల సారమునకును, అద్దానియందలి సారాంశమునకును ఆతని కేమాత్రమును భేదము లేకుండెను. ఆతడు చిన్నతనమునందే, బౌద్ధ, జైన, హిందూవైష్ణవగ్రంథము లనేకముల జూచియుం డెను. వానితత్త్వమును గ్రహించినవాడై వానియందలి ధర్మములను చక్కగ పరిశోధించుచుండెడివాడు. వానికిని క్రీస్తు సందేశమునకును ఏలాటిభేదమును ఆతడు కనుగొనడాయెను. రూసోవలెనే గాంధియు ఆధునికసభ్యతయందలిగల భౌతిక చింతను, దౌర్జన్యమును, తూలనాడి, స్వాతంత్ర్య జీవనాను కూలమై, స్వాభావిక పరిస్థితులందు లభించు జీవితమునం దభిమానముగలవా డాయెను.

భారతదేశమునందలి పురాతనదశను మదిని దలంచుకొనుచు అద్దానియందు సంతసము గనుచుండెను. ఆనాటి ప్రాక్తనధర్మములను తలచుకొనినప్పుడెల్ల, మానవులు ప్రవిమల మనస్కులై భగవంతుని సాన్నిధ్యమున ధ్యానపరులై యుండిన యాపుణ్యదినము లాతనిమనంబునకు జ్ఞాపకము వచ్చుచుండును. వారు కాననాంతరముల యాశ్రమవాసులై యుండి సాత్త్వికస్వభావము గలవారై జీవితముల గడుపుచుండిరి. అందువలన వారిజీవితములు స్వాస్థ్యముతోడను, ఆరోగ్యముతోడను, సౌందర్యముతోడను తులతూగుచుండెను. ఆధునికసభ్యతయం దటువంటి సాత్త్వికగుణము కానరాదాయె నని యాతడు వచించుచుండును. అయ్యది పవిత్ర

వంతముగాక కల్మషభూయిష్ఠమయి యుంటంజేసి ఈనాటి మానవులు శ్రీమన్నారాయణుని కనుంగొనజాలని స్థితియందున్నారు. అందుచే మనము ఈశ్వరుని దర్శింపదలంచితిమేని మనము ఆధునికసభ్యతను సంపూర్ణముగవీడి, ఎప్పటియట్ల మన పూర్వపుప్రకృతి కనుగుణ్యమగు స్వాభావికజీవితమున కుంబోవలెను. మనచిత్తముల సంస్కరించుకొని పవిత్రవంతులము కావలయును. శాంతముగ నుండవలయును. ఇకను మనము ధనమును, దైవమును, యీరెంటిని యారాధింపజనదు.

మ హా త్ము ని యు ప దే శ ము లు — నా జీ వి త ము.

మహాసీయునిభావముల నేదోయొకవిధమున తెలుపగలిగితిని. అయ్యవి, యాతని దివ్యవ్యక్తిత్వసత్వముచే సమ్మిళితమై మేలు బంగరుకిరణముల ప్రసరింపుచు జ్ఞానకాంతుల వెదజల్లుచుండుటంజేసి, నాజీవితమునం దఖండమగు మార్పును గలిగించి యద్దానిని పునః నిర్మించె ననుటయం దేయతిశయోక్తియు లేదు. ప్రథమమున నామనస్సున కాతనియుపదేశములాశ్చర్యమును గొలిపినను, అయ్యవి మొట్టమొదట నామనంబునకు నచ్చకున్నను, కొంతసంఘర్షణ జరిగినతరువాత వ్యతిరేకభావములు సమసిపోవుటయు, ఆతనిజీవితము ననుసరించుటకు నాకుంగల ప్రతిబంధకములు పోవుచుంటయు తటస్థించు

చున్నది. పూర్వాచారపరం బగుపట్టుదల లనేకముల నేను వదలివేయుట సంభవించుచున్నది. ఆతని యుపదేశములకు, నా యభిప్రాయములకును సంఘర్షణ మెచ్చటనున్నదో కనుం గొనుచు అంతటి జ్ఞానోదయమున కమితానందభరితుడ నగు చుండువాడను. అంతియగాక నేనెందు తప్పుత్రోవల బట్టు చున్నాడనో కనుగొనుచు, వానివలననే నేనపజయ మొందు చున్నాడను. విషయమును చక్కగ పరికించుటకు నే నెంత యు సంతసించుచుందును. సాక్రెటీసుయొద్దకుం జనుచుండిన శిష్యులను సాక్రెటీసు విశేషముగ తీవ్రమగు విమర్శనలకు పాల్చేసి, వారిని సంపూర్ణముగ నోడించి మఱల తా మెచ్చట తప్పుజేయుచున్నారో వారి కెఱిగించుచుండెడివాడు. నేనును ఆశిష్యులలో నొక్కడనువోలె భావించుకొనుచుందును. ప్రా గ్దేశపుసాక్రెటీసో యనందగు మహనీయుని యుపదేశముల విననకొలందియు నాయపరాధముల కనుగొనుచున్నాడను. ఒకొకప్పు డాతని యమోఘవాక్యములు నామనంబులందు సంపూర్ణముగ నాటుకొని మోహమున భ్రాంతి జెందుచుం డును. అంతయేల యాతని దివ్యతరభావము లలనాటి క్రీస్తు యొక్కసుభాషితములను సదా స్ఫురణకుం దెచ్చుచుండును.

నిన్ననే జరిగినవిషయమువోలె జ్ఞప్తియం దున్న యొక యుదాహరణము నొసంగెదను. ప్రిటోరియా సరిహద్దుల యావల 'కాఫరుల నివాసార్థమై' పురపాలక సంఘమువారిచే

నిర్మింపబడినచోటునకుం బోయి యుంటిమి. మఱలివచ్చి నప్పుడు మార్గమధ్యను చెట్లనీడయందు, ఏటిదాపలం గూర్చుండి యనేకవిషయముల మాట్లాడితిమి. నేను కొన్నిదినములనుండి శాఖాభక్షణముల వాడుచుండుట, మాంసభక్షణకు పూర్ణముగ వ్యతిరేకాభిప్రాయము లుంటంజేసి కాదు. అట్లొనరించుట యితరులమనంబుల నొప్పింపకుండుటకే యని తెలియనగును. నే నిప్పు డీవిషయము గాంధిగారితో వాదించితిని. సృష్టినిర్మాణమునందు పెద్దజంతువులు చిన్నజంతువులను తినుట సహాజ మగుటంజేసి మానవులు మాంసభక్షణ జేయవచ్చును. అందువలన మాంసభక్షణ చేసినను అయ్యది దోషముగ నెంచబడదు. అని గాంధిగారితో వాదించియుంటిని. అంత నొక్కనిముసములో యాతనినేత్రములు ప్రజ్వలితము లయ్యెను. అంత నాత డతిశాంతముతోడను తనదు నిగ్రహాసమన్వితమయిన కంఠంబుతోడను యిట్లు పలికెను. 'మీరు క్రైస్తవమతస్థు లయ్యు అంతటి దూషణీయమగు వాదము జేసితిరి. క్రీస్తు భగవదంశాసంభూతుం డని మీ బైబిలుగ్రంధము చాటె నని తలంచియుంటిని. క్రీస్తు అంతటి దివ్యస్వరూపుం డగుటంజేసియే యాతడు పాపకర్ములగు మానవకోటికి తనదు శరీరము నర్పించెను. అందుగల యంతరార్థమును నేను గ్రహింపగలుగుచున్నానే గాని మీవాద మెంతయు నాకు గ్రాహ్యమగుట లేదు. ప్రపంచమునం దుండు

యొక చిన్న కీటకమును సంరక్షించుటకై మానవకోటియంత యు తమప్రాణములను సమర్పించుచుండుట జూడ నాకమితా నందము గలుగును. అయ్యది నాకు నేత్రోత్సవముగ నుండ గలదు. అయ్యదియే సర్వసౌందర్యముల ప్రకాశవంతమయి దివ్యతమ మగును. మీవాద మెంతమాత్రము సమ్మతము గానేరదు. ఎంతటి దయారహితుడగు హిందువైనను అట్టి వాదముల జేయ సాహసింపడు. జైనమత ప్రపంచమంతయు నొక్కుమ్మడి మీవాదమును ఖండించివేయును. బౌద్ధమతమో యద్దానిని సంపూర్ణముగ చెండివైచును. క్రైస్తవమతము సయిత మద్దానిని హర్షింపదు.

## స్వరాజ్యసాఫల్యము — కార్మికులు.

ఆతని ప్రతిభావిశేషముల దెల్పుటకు నేనీవిషయముల జెప్పుటలేదు. బీదలయెడల వారి కెంతటియభిమానము ప్రేమ గలదో నిరూపించుటకు చెప్పితిని. వీరియభిప్రాయములకు భిన్నముగ నిటీవల కలకత్తాయందు సమావేశమయిన జాతీయ వాదులగు యువకులు కొందఱు ముప్పదిరెండుకోట్ల భారతీ యులకు స్వరాజ్యము వచ్చునెడల, ఏల కొందరుబీదల నర్పించ కూడదని వాదించిరి, నేను రెండవలేఖయందు వ్రాసినటు వంటి చాందపురమునందు కలరావ్యాపకమువలన కొందఱు మడిసినను సరే సాధ్య మగునేని రైలువేపనివారియొక్కయు,

స్త్రీమర్ల పనివారియొక్కయు సమ్మె కట్టింపవచ్చుననియు, ము ప్పదిరెండుకోట్ల భారతీయులకు స్వరాజ్యము సంపాదించుటకు కొన్ని వేలకూలీలను సమర్పింపవచ్చుననియు కొందఱు వాదించిరి. అప్పుడు నేనీకథను వారల కెఱిగించితిని. కొందరు బీదలకొఱకు భారతీయు లెల్లరును ఆత్మసమర్పణము చేయుటకు సంసిద్ధులయినయెడల నయ్యది ప్రశంసనీయమే యగును. కాని యుద్ధానికి భిన్నముగను వ్యతిరేకముగను ప్రవర్తించితిమేని యందు గాంధియుపదేశసారాంశ మించుకేనియు లేదనియే చెప్పవచ్చును. గాంధిమహాత్ముని యమోఘమగు వాక్యములకు భిన్నవర్తనుల మగుటయేగాక, యాతని యుద్యమమునందు భగవదాంశసంభూతమయిన దేదియు లేదనియే చెప్పవచ్చును. వారు వెంటనే యద్దాని నంగీకరించిరి. వారి యుపదేశములబలము నాపుటకు ఎవ్వరితరమగును? అద్దాని శక్తిని వారు నివారింపలేకపోయిరి.

ఇంతటితో నీలేఖల ముగింపునకు దెచ్చెదను. నిరాకరణవాదులు ప్రభుత్వమువారిపై నేరారోపణ గావించినందులకు ప్రబలకారణముల జెప్పెదను. ప్రస్తుతవిధానము రానురాను బీదలను కష్టములపా ల్చేయుచున్నది. వారిని హింసించుచున్నది. ఇకను ప్రభుత్వవిధానమో ఏలాటిమార్పునకు నవకాశ మొసంగక కేవలము మొద్దుస్వరూపమును కలిగియున్నది.

పేదలపాలిటి కల్పవృక్ష మనుపేర భారతీయప్రభుత్వము బఱగుచుండినది. అయ్యది నిశ్చయముగ నంతటిగౌరవమునకు తగియుండిన దనియే చెప్పవచ్చును. ఆ అంతటిమహోన్నతమగు బిరుదరాజము 'కైసరీహింది' యున్నగు బిరుదావళి కన్న విశేషమగు గౌరవమును గలిగియున్న దనియే చెప్పవచ్చును. అయిననేమి యిటీవల ప్రభుత్వమువారి చర్యలవలన నయ్యది సంపూర్ణముగ మాటువడినది. ప్రతిమూలయందు నున్నటువంటి బీదల క్షుద్బాధారవములు హెచ్చుగుచునే యున్నవి.

## ఒకయుదాహరణము.

ఇంతటిదోషము నాపాదించుట క్రూర మగునే మొ? ప్రభుత్వముయొక్క నిజస్వరూపము 'క్రూరత్వ' మనుమాట మఱువ బహుదూరము యత్నించితిని. కాని వీలులేదాయె. దిన దినము ఆయభిప్రాయములు వృద్ధి యగుచున్న వేగాని తగ్గుట లేదు. ఆయభిప్రాయము హేతుభూతము కాదని యనుకొనుట కావంతయేనియు నవకాశము కానరాదాయె. అందులకు నిదర్శనముగ శ్రీయస్. ఇ. స్టోక్సుగారు కొటగిరినుంచి రాజప్రతినిధిగారికి వ్రాసిన బహిరంగలేఖనుండి యొకయుదాహరణము నిచ్చెదను. సిమ్లాయందలి రాజప్రతినిధిగారి వాసస్థలమునకు పదునాలుగుమైళ్లదూరమున నున్న హిందూదేశము

నుండి టిబెట్టుకు వేయబడినమార్గము విషయమయి చెప్పబడి నది. ప్రభుత్వమువారు, అందువలన ప్రజలకును, అందు ముఖ్యముగ బీదవారలకును గలుగుచున్న కష్టములను బాగుగ నెఱింగియు, తాముచేయుపనిని నాపరైరి. ఈవిషయమును గురించి స్టోక్సుగా రిట్లు వ్రాయుచున్నారు. ‘మీచేఁతవనే యీయక్రమము జఱుగుచుండుటం జేసి మీరు వెంటనే తగు చర్యను దీసికొందురనునమ్మకము గలవాడనై నేను సంతసము తోడ నాగృహమునం దించుక విశ్రాంతినొందుటకై పోయి యుంటిని. వైద్యులచే విశ్రాంతినొందు డని నిర్బంధింపబడిన నేను సయితము కలతజెందినవాడను కావలసివచ్చినది. అచ్చట పనిచేయుచుండిన నా యనుచరులు వెంటనే నిర్బంధింపబడిరి. ప్రజలకు అచ్చట జరుగుచుండిన యక్రమములను తెలియ జెప్పినందులకు కొందఱు బంధింపబడిరి. రానురాను వా రెట్లు బానిస లగుచున్నారో వారి కెఱుక జెప్పినందులకు కొందఱకు అపరాధములు వేయబడినవి. మఱికొందఱు బెదరింపబడిరి. అంత, నాదేహ మస్వస్థతగనున్నను, నేను ఫెగు పట్టణమునకుం బోయితిని. నాయకు లెల్లరును బంధింపబడి యుంటయు, ఫెగుయం దంతటను సిమ్లా పురరక్షకభటపటాలములు నిండియుంటయు, ప్రజ లించుక భయమొందియుండుటయు చూచి కనుగొంటిని. ఆప్రదేశవాసు లెల్లరును బానిసలుగ నుండుటకు నిర్బంధింపబడుచుండిన యక్రమమును

తొలగించుటకై నొకమహాజరును తయారుచేయుచుండిన పండిత కపూరసింగుగారు బంధింపబడిరి. అచ్చటి యమానుష కృత్యము ప్రతియాంగ్లేయుని కోపోద్దీపితుని జేయుననుటయందేసందేహమును లేదు. ప్రభుత్వమువారిపాలనాపద్ధతి యటుండ ప్రజలకు గౌరవప్రదమైనమార్గ మొక్కటియే కలదు. న్యాయముజఱిగి యక్రమము సమసిపోవుటకు ప్రజలు ప్రభుత్వమువారితో నేలాటిసంబంధమును గలిగించుకొనక నిరాకరణము నవలంబించుటకన్న వేఱుమార్గ మెయ్యదికలదు? నిరాకరణము నవలంబించుటే యాత్మ గౌరవము నిచ్చునని వేఱుగ జెప్పవలయునా?

## స్టోక్సు గారమెరికాదేశీయులు.

యుద్ధసమయమునం దాతడు ఆంగ్లేయులకు సహాయము జేయు నుద్దేశముతోడ హిందూదేశమునకు విచ్చేసినవాడై ఇచ్చట వాసస్థల మేర్పఱచుకొనెను. యుద్ధమున కాతడు తనప్రదేశమునుండి యనేకులను సైనికులుగజేర్చి యంపియుండెను. వారిలక్ష్య మెప్పుడును ప్రభుత్వమునకు సహాయము చేయ నభిలషించుచుండును. బీదలను హింసించినవిషయము ఆతని నయితము నిరాకరణవాదిగ జేసినైచినది. తుదకు ఆతడు ‘ ప్రభుత్వమువారు తమ యన్యాయప్రవర్తనను వదలు

దనుక మనము ప్రభుత్వమువారికి తోడ్పాటొసంగకుండుటే మన ముఖ్యకర్తవ్య' మని ఘంటాపథముగ చాటెను.

## దృక్పథము మాఱవలెను.

రాజప్రతినిధి నివాసస్థలమున కనతిదూరమున నుండియు, స్టోక్సువంటి పాశ్చాత్యుడు, ఆయన్యాయమును తొలగించుడని ప్రభుత్వమువారి కనేకపర్యాయములు విన్నవించుకొనినను, ప్రభుత్వవర్గమువారు వానినంతటిని నిర్లక్ష్యభావమున జూచుచు ఎప్పటియట్ల తమ నిరంకుశత్వమును చెలాయించుచున్నారుగదా! ఇట్టిస్థితియందు ప్రభుత్వమువారు భారతీయులహక్కుల కాపాడగలరని ఎటుల నమ్ముదుము? ఇంతటి మొఱటుతనము నభిలషించుచున్న ప్రభుత్వమువారు ముప్పదిమూడుకోట్లప్రజల మొఱల నాలకించి వారియభీష్టముల నెంతమాత్రము నెఱవేర్చుచున్నారో మీరే యూహింపగలరు. దేశమునం దంతటను అక్రమములు పెక్కులు జఱుగుచున్నవి. వీటి నివారించుటకు వలనుకాకున్నది. ప్రభుత్వోద్యోగీయులు యింకను నెక్కుడు నిరంకుశత్వమును చెలాయించుచు దేశమునందు ప్రబలుచున్న దేశారిష్టములకు కారకు లగుచున్నారు. న్యాయముబడయుని వ్యవహారములు పెక్కులు జరుగుచుండ నేరస్థులు శిక్షితులు కాకపోవుటయేగాక, తాబేదారీ యుద్యోగీయులు పుల్లలుపెట్టి వారిని ప్రోద్బలము చేయు

దురు. గాంధిమహాత్ముడు యిటీవలచెప్పిన హితవాక్యములను మనము మఱువజాలము. మద్యపానాది దుర్వ్యసనములవలన ప్రజలు, అందు ముఖ్యముగ బీదవారు, ఎట్లు దౌర్భాగ్యస్థితి ననుభవించుచున్నదియు హెచ్చరించుచు వారిని యట్టి దుర్వ్యాపారములనుండి వారించుటకు సర్వప్రయత్నముల జేయుచున్నాడు. బీదలపాలిటి కల్పవృక్షమై యాతడు వారి శ్రేయోభివృద్ధికై ఎట్టిపాటుల బడుచున్నదియు ఈ క్రిందివాక్యములవలన నించుక బోధపడగలదు.

'మన యుద్యమమునకు తోడ్పడుడని మితవాదులను, ప్రభుత్వవర్గమువారిని సయితము కోరుట తప్పు కానేరదు. వారిని తమకు సాధ్యమయినంతవఱకు, వారిశక్తి యున్నంతమట్టుకు, వారివారిమార్గముల మనయుద్యమమునకు తోడ్పడు డని కోరుట నేరము కాదు. ఖిలాఫతుసమస్యా పరిష్కారమునందుకు, పాంచాలదేశస్థితిని బాపుటయందును, మద్యపానాది మత్తుద్రవ్యముల విక్రయించుదుకాణములను మూయించియు, పాఠశాలలయందు రాటముల బెట్టించియు, విదేశవస్త్రము లీదేశమునకు రాకుండ చట్టములనిర్మించియు, మున్నగు ప్రయత్నముల జేసియు మాకు సహాయపడుడని కోరుటయందే తప్పును లేదు. వా రిట్లు సక్రమమగు ప్రయత్నముల జేసినచో వారిపద్ధతిని ఆక్షేపించము. వారిరాజ్యాంగమును తూల

నాడము. ప్రజలవిశ్వాసమును చూరగొనుట వారి కిందు మూలముగ నవకాశ మిచ్చుచున్నారము. వారిద్దానిని జారవిడిచినచో ప్రభుత్వపుపద్ధతియొక్క మొద్దుస్వరూపమును ప్రజలకు స్పష్టపడును. అద్దానిని మార్చుటకు మేముచేయు యాందోళనయందు మాకు బల మత్యధికము కాగలదు.'

మీమట్టుకు మీరే యాలోచించుకొనుడు. ఇవియన్నియు మూఢవిశ్వాసమువలన చెప్పబడినమాటలా? కేవలము విప్లవము నాశించుచు ప్రజాసంక్షోభము తెచ్చిపెట్టి ధ్వంసమునే యపేక్షించువానిమాటలా? ఈవాక్యములు కేవలము రాజకీయ వేతయొక్కమాటలుగ నున్నవా? ఏరాజకీయవేత్తయైనను తనప్రతిపక్షునకు ఇంతటియవకాశము నియ్యడు.

ప్రస్తుతము భారతీయప్రభుత్వము గాంధిగారిచే యొసంగబడిన యవకాశముల నందుకొని ప్రజాశయముల గుర్తెఱింగి వారికి తోడ్పడిన బాగుగనుండెడిది. భారతదేశమునందుండు కోట్లకొలదిగ గల బీదవారికి సంబంధించు నీవిషయములందు ప్రభుత్వమువారు తమపంతమును నెగ్గించుకొన నుద్యుక్తులై, తమ మొండితనమును, రాక్షసత్వమునే చూపుచున్నారని నా యనుభవమువలకు నేను ఘంటాపథముగ జెప్పగలవాడను. ప్రజాశయముల గుర్తెఱింగి ప్రజానుగుణ్యముగ రాజ్యపాలన చేయుచు తమరాజ్యమును రామరాజ్యముగ జేయునటువంటి

స్థితియం దున్నట్లు కానరాదు. ప్రస్తుతదృక్పథము మారిన గాని వారు ప్రజలయాజ్ఞలను శిరసావహింపరు.

## ఒక సహకారుని వాక్యములు.

నే నిప్పుడే 'ఇండియను సోషియల్ రిఫార్మరు' పత్రికా సంపాదకులు వ్రాసినసంగతుల చదివితిని. ఆతడు రాజకీయ విషయములందు చక్కనిపరిజ్ఞానము కలవాడు. ఆతడు నిరాకరణవాది కాడు. కావున యాతనిమాటల కెక్కువవిలువ యుండును.

'ఆంగ్లదేశ సంబంధమువలన హిందూదేశమునకు విశేషము లాభకరముగ నుండునని యొకప్పుడు కనుపించినది. మన్రో మున్నగు ఆంగ్లేయపాలకులు భారతీయులు తమంతట కాపాడుకొనుటకు ఆంగ్లేయులు తోడ్పడవలయునని సంకల్పించినకాల మది. ఇప్పు డాకాలము మారినది. అటువంటి ప్రభువులు పోయిరి. ఈనాడు భారతదేశమును దోచుకొని పోవుట కనువగునట్లు దేశమును నిస్సహాయస్థితికిం గొని తెచ్చు నుద్దేశములుగల సామ్రాజ్యతత్వమునందు సంపూర్ణమగు భక్తి విశ్వాసములుగల యాంగ్లేయప్రభువులు బయలుదేరిరి. భారతీయుల యభివృద్ధి నాలోచింపక తమలాభమునే ప్రధానముగ నెంచినటువంటి పాలకవర్గము పెచ్చుపెరిగినది. చింతనీయమును, న్యాయవిదూరము నగు సామ్రాజ్యతత్వము

నానాటికి ప్రజలకును ప్రభువులకును ఎడబాటును వృద్ధిచేసినది. అందువలన రానురాను ప్రజలయందు భారతప్రభుత్వమువారి యధికారమునం దుండవలసిన ధర్మనిరతి తప్పిపోయినది. అందువలన ప్రభుత్వమువారు ఎల్లప్పుడును తమ నిర్బంధవిధానబలమునందే యాధార ముంచుకొనవలసినగతి పట్టినది. దేశీయుల చీలదీసి నాలింపవలసిన యావశ్యకత యేర్పడినది. కాని యీదుర్మార్గపుపద్ధతులు విఫలము లైనవి. మహామ్మదీయుల బుజ్జగించి విద్యాధికుల రాజకీయాశయముల నణచుటకై ప్రభుత్వవర్గమువారు పడినయగచాట్లు చెప్ప నలవి కాదు. అద్దానిపాపము వారినే యావరించినది. అద్దానిని వారు త్వరలో మఱచిపోరనియే చెప్పవలయును. నిర్బంధవిధానమువలన ప్రజలు బంధింపబడినవా రగుటకుబదులు వారియం దుండినయశాంతిని ప్రజ్వలింప జేసినది. అందువలన యాశాసనములను తీసివేయవలసి వచ్చినది. అతిస్వల్పమగు యధికారమును ప్రసాదించు సంస్కరణవిధానమువలన కలిగినలాభములు సయితము ప్రభుత్వమువారిచే కేవలము లాభముల పొందునిమిత్తమే యవలంబింపబడిన యార్థికవిధానమువలన, పూర్తిగ వమ్మయిపోయినది. స్వలాభము నపేక్షింపక భారతదేశ శ్రేయోభివృద్ధికై పాటుపడిన పూర్వము ఆంగ్లప్రభువులవలె యీకాలమున హిందూదేశ రాజ్యాంగము వారు పూర్వపు ధర్మప్రవృత్తికిం దిగుట సాధ్యమగునా?

అతిజాగరూకతతోడ ప్రవర్తించు మితవాదియొక్క పై వాక్యములను గాంధిమహాత్ముని వాక్యములను గమనించి పరికింపుడు. భారతదేశమునందంతటను సర్వజనులయందును ప్రబలియున్నటువంటి యశాంతి గోచరము కాగలదు. ఆంగ్లదేశ పత్రికలయందు ప్రకటింపబడు విషయములకును, హిందూదేశమందలి యథార్థస్థితికిని కలభేదములు స్పష్టపడగలదు.

పై నాలుగుఉద్దండలేఖలు ఆంగ్లదేశమునందలి మిత్రునకు వ్రాయఁబడినది.

వందేమాతరం.

శారదాంబావిలాసముద్రాక్షరశాల, మదరాసు.

## మా ప్రచురిత గ్రంథ రాజములు. ౫౯

**1. పుష్పాంజలి.** (ఆధునిక కవి విరచిత భావగీతములు)

గీతముల చదువుచున్న శ్రీకృష్ణుని మురళీగానమును వినుచున్న ట్లేయుండును. అందలిమాటలు తేనియతేటలు. వాని నడకలు రాచహంస యొయ్యారములు. రండు! రండు! పుష్పాంజలిగైకొండు! మీకంఠంబుల నీ సుమమంజరులతోడ నలంకరింపుడు. మీ మానసముల సుధాధారలతో నింపివేయుండు. మంచి ఫెదర్ వైటు కాగితములపై కడురమణీయముగ ముద్రించబడియున్నది.

వెల 1-8-0.

**2. భారతస్వాతంత్ర్యము.** (ఆంధ్రదూసువిరచితము)

కేవలము ఋషివలె సంచరించుచు మానవసేవజేయు నిమిత్తమై తన జీవిత కాలము నంతటిని వినియోగించుచున్న ఆంధ్రదూసుగారిందు భారతదేశము నకు సత్వరసర్వస్వాతంత్ర్యావశ్యకతను నిరూపించుచు వ్రాసియున్నారు.

వెల 0-6-0.

**3. స్వతంత్రజీవనము.** (సుధాకర కవి విరచితము)

స్వాతంత్ర్యమునకై భారతీయులందరును పోరుసల్పుచుండుతరి, నిజమగు స్వాతంత్ర్యమన నెద్దియో కనుగొనుటకీగ్రంథము తోడ్పడును. స్వేచ్ఛలేని జీవనము జీవనమే కాదని గ్రంథకర్త బహుచక్కగ నిరూపించియున్నాడు. ప్రకృతియందున్న స్వేచ్ఛాస్వరూపమును చెప్పుచు, మానవునిస్వాతంత్ర్యజీవనము పరమోత్కృష్టమైన దనియు స్వేచ్ఛశారీరిక మనియు, స్వాతంత్ర్యము ఆత్మపర మనియు సహేతుకముగ జూపబడియున్నది. వెల 0-8-0.

**4. ఆంధ్రమాత.** (రాజకీయనాటకము)

ప్రస్తుత రాజకీయపరిస్థితులన్నియు ఇందు బహుచక్కగ వర్ణింపబడియున్నవి. వెల 1-0-0.

**5. తిలకుశతకము.** (ఉత్సాహపూరితవృత్తశతము)

లోకమాన్యుడయి భారతీయుల గమ్యస్థానముజేర్ప కాయకష్టములకోర్చి

భారతమాత సేవజేసిన తిలకుగారిపై నిందు నూటఎనిమిది చక్కనిపద్యములు గలవు. శైలి మధురముగ నున్నది. వెల 0-4-0.

## 6. గాంధిమహాత్ముని హైందవస్వరాజ్యము.

ఈగ్రంథము చదివిన గాంధిమహాత్ముని నిర్మలతత్త్వము సుబోధకర మగును. ఇందు గాంధిమహాత్ముడు ప్రపంచమునందుండు దురాశాపిచాశముల పాలఁబోలి శాంతిని నెలకొల్పుటకు హైందవులధర్మము చక్కగ చెప్పబడియున్నది. శ్రీయుత గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారి ఆంధ్రీకరణము. వెల 0-8-0.

## 7. ఆశియాఖండవిజ్ఞానరహస్యము. (వస్వానిపండితవిరచితము)

వాస్వానిగారు గాంధియంతటి మహామహు డనియు, గాంధీగారిని మన మధ్యనుండి తొలగించినయడల ఆయనస్థానమును ఆక్రమింపగల్గినంతటి ధీశాలి యనియు గాంధీగారే సూచించియున్నారు. ఈపొత్తమందు ప్రాచ్యుల జ్ఞానౌన్నత్యము కడురమణీయంబుగ వర్ణింపబడియున్నది. పాశ్చాత్యులే నాగరికత కలవారను మిథ్యావాదులయంధకారమును బాపుట కీపొత్త మెంతయు సహకారికాగలదు. ప్రతివారును జదువవలసినగ్రంథము గాన దీనివెల సరసముగా నుంచినారము. వెల 0-8-0.

## 8. నిరాకరణోద్యమతత్త్వము. (ఆండ్రూసువిరచితము)

ఋషిపుంగవుండగు ఆండ్రూసుమహనీయుడు నిరాకరణోద్యమమె భారతీయులకు శరణ్యమని ఋజువుపఱచుచు ఆంగ్లేయమిత్రుని కొకనికి వ్రాసిన యుత్తరము లిందుగలవు. గాంధీమహాత్ముని గుణగణంబుల నీయాంగ్లేయుడు బాగుగ శ్లాఘించియున్నాడు. వెల 0-6-0.

## 9. స్వరాజ్యరథము. (సోమరాజు రామానుజరావుకృత రాజకీయనాటకము)

నిరంకుశాధికారవర్గమువా రీనాటకప్రదర్శనమును బహిష్కరించుటయే

ఈనాటకముయొక్క విలువను సహస్రీకరించెననుటలో ఏలాటిఅతిశయోక్తి గాని లేదు. ఇందలిపద్యములను చదివితీరవలయును. వెల 0-8-0.

10. రాణి లక్ష్మీభాయి.

**1857** సంవత్సరమునందు జరిగిన సిపాయికలహములో నీ భారతవనితామణి తనరాజ్యము నపహరించిన ఆంగ్లేయులతో నెట్లు పోరుసలిపి తన యసమాన ధైర్య, శౌర్యసాహసములను వెల్లడించెనో ఇందు వర్ణింపబడియున్నది. వెల 0-4-0.

## రాజకీయ నాటకములు.

| | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|
| 1. ఆలీప్రభృతులనిర్బంధము | ... | 0 | 10 | 0 |
| 2. గాంధివిజయము | ... | 0 | 12 | 0 |
| 3. కలియుగప్రహ్లాద | ... | 0 | 10 | 0 |
| 4. స్వరాజ్యపతాకము | ... | 1 | 0 | 0 |
| 5. గాంధిమహోదయము | ... | 0 | 8 | 0 |
| 6. స్వరాజ్యధ్వజము | ... | 0 | 12 | 0 |
| 7. పంజాబునాటకము | ... | 0 | 12 | 0 |

## గీతములు, కీర్తనలు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. స్వరాజ్య భజనకీర్తనలు | ... | 0 | 4 | 0 |
| 2. దేశీయకీర్తనలు | ... | 0 | 3 | 0 |
| 3. స్వరాజ్యగీతములు | ... | 0 | 4 | 0 |
| 4. ప్రబోధ | ... | 0 | 5 | 0 |
| 5. సింహపురి స్వరాజ్యకోకిలము (గీతములు) | ... | 0 | 4 | 0 |
| 6. గుంటూరుగోష్ఠి | ... | 0 | 3 | 0 |
| 7. స్వరాజ్యసమస్య (పద్యములు) | ... | 0 | 4 | 0 |
| 8 భారతోద్బోధము | ... | 0 | 4 | 0 |

## ప్రచురిత గ్రంథ రాజములు.

### గాంధిగారి వచనగ్రంథములు.

| | | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|
| 1. | గాంధిగార మూర్ఖరాజు | ... | 0 | 4 | 0 |
| 2. | డిటో ‘ నాజైలుఅనుభవములు ’ | ... | 0 | 12 | 0 |
| 3. | డిటో ఉపదేశములు | ... | 0 | 12 | 0 |
| 4. | డిటో నీతిధర్మము | ... | 0 | 4 | 0 |

### జాతీయనాయకుల జీవితచరిత్రములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | మహాత్మగాంధిగారి సంపూర్ణజీవితము | ... | 1 | 8 | 0 |
| 2. | అరవిందయోగిజీవితము | ... | 0 | 5 | 0 |
| 3. | కేవరుప్రధాని (ఇటలీరాజ్యస్థాపకుడు) | ... | 0 | 6 | 0 |
| 4. | అబలాసచ్చరిత్రరత్నమాల (బండారు అచ్చమాంబ) | | 1 | 4 | 0 |
| 5. | అబ్రహాములింకను | ... | 0 | 12 | 0 |
| 6. | మహారాష్ట్రవీరులు | ... | 0 | 6 | 0 |

### రాజకీయ వచనగ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | తిలకుగారి సంపూర్ణ ఉపన్యాసములు | ... | 2 | 4 | 0 |
| 2. | భారతవస్త్రపరిశ్రమలచరిత్ర | ... | 0 | 8 | 0 |
| 3. | స్వాతంత్ర్యసందేశము (వస్వాని) | ... | 0 | 8 | 0 |
| 4. | మద్యపానము (ప్రతాపరెడ్డి) | ... | 0 | 10 | 0 |
| 5. | ప్రభుత్వము (సర్వోత్తమరావు) | ... | 0 | 8 | 0 |
| 6. | స్వరాజ్యదర్పణము | ... | 0 | 8 | 0 |
| 7. | స్వరాజ్యమహాసభ | ... | 0 | 4 | 0 |
| 8. | చిత్తరంజనదాసుగారిజీవితము ఉపన్యాసములు | | 0 | 4 | 0 |
| 9. | భారతవిజ్ఞానరహస్యము (వస్వాని) | ... | 0 | 12 | 0 |
| 10. | పంజాబు వధలు | ... | 0 | 8 | 0 |

